18.1.1991 శుక్రవారం 24 పేజీలు సంపుటి : 62 సంచిక : 3 విడిప్రతి : రు 1.50లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు
మేనేజింగ్ ఎడిటరు : నెల్లూరు శ్రీరామమూర్తి.



పంచవర్ణాల పూమాల చేతబట్టి ప్రియమార పిలుస్తున్నది విన్నావా
సింహపురి నగర కాంత కదలిరావయ్యా, జనార్దనా !

## జనార్దనుడికి రాజీవ్ అండ

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన్ రెడ్డి తన పరిపాలనా సామర్థ్యంతో రాజీవ్ గాంధీని మెప్పించారు. పదవీ బాధ్యతలు స్వీకరించిన గత నెల రోజుల్లో రాష్ట్రంలో సాధారణ పరిస్థితిని నెలకొల్పడానికి శ్రీ జనార్దన్ రెడ్డి తీసుకున్న చర్యలపట్ల ఏ.ఐ.సి.సి. అధ్యక్షుడు శ్రీ రాజీవ్ గాంధీ పూర్తి సంతృప్తిని వ్యక్తంచేసినట్లు తెలిసింది. డాక్టర్ చెన్నారెడ్డి ఏడాది పాలనలో పోయిన పార్టీ పరువును పునరుద్ధరించడంలో శ్రీ జనార్దన్ రెడ్డి కృతకృత్యులు కాగలరని శ్రీ రాజీవ్ గాంధీ ఇటీవల తనను కలుసుకున్న కొందరు ఎం.పి.ఎల్‌తో, రాష్ట్ర నాయకులతో అన్నారట. రాష్ట్రంలో తిరుగులేని అభ్యర్థిగా మెజారిటీతో ఎన్నికైన శ్రీ జనార్దన్ రెడ్డి అధిష్ఠానవర్గంతో నెగ్గుకు రావడం కష్టమని మొదట్లో భావించారు. అయితే అధిష్ఠాన వర్గం మనసులో యేమున్నా రాష్ట్రనాయకత్వం చేపట్టాక జనార్దనరెడ్డి పనితీరువల్ల అధిష్ఠానవర్గం పెద్దలు ఇప్పుడు సంతృప్తి కరంగా ఉన్నారు. రాజకీయంగా శ్రీ జనార్దన్ రెడ్డికి మద్దతు ఇచ్చేందుకు శ్రీ రాజీవ్ గాంధీ రాష్ట్ర పర్యటనకు వచ్చారు. నిజానికి ఈనెలలో రాజీవ్ రాష్ట్రానికి వచ్చే అవకాశం లేనప్పటికీ శ్రీ జనార్దన్ రెడ్డి కుమారుడి పెండ్లికి తప్పకుండా హాజరుకావాలని నిర్ణయించుకోవటంతో పనిలో పనిగా నగర పర్యటన ఏర్పాటుచేశారు. శ్రీ రాజీవ్ గాంధీ మామూలుగా అయితే పెండ్లి పేరంటాలకు హాజరుకావడం బహు అరుదు. అటువంటిది శ్రీ జనార్దన్ రెడ్డి తన కుమారుడి పెండ్లికి రావాలని పిలిచిందే తడవుగా రాజీవ్ గాంధీ ఠక్కున ఒప్పేసుకున్నారట. శ్రీ జనార్దన్ రెడ్డికి నైతికంగా మద్దతు ఇవ్వటానికి శ్రీ రాజీవ్ గాంధీ ఈ పెండ్లిని సాకుగా తీసుకున్నారని అభిజ్ఞవర్గాల కథనం. చెన్నారెడ్డి హయాంలో నగరం మండిపోతుండటంతో స్వయంగా నగరానికి వచ్చి బాధితుల్ని పరామర్శించేందుకు శ్రీ రాజీవ్ సాహసించలేక పోయారు. ప్రస్తుత పరిస్థితులు మారటంతో పనిలోపనిగా పాతబస్తీలోని బాధితుల్ని పరామర్శించే కార్యక్రమం కూడా ఆయన పెట్టుకున్నారు. చెన్నా వారసుడి ఎంపికపట్ల రాజీవ్ గాంధీ ఇప్పుడు పూర్తి సంతృప్తికరంగా ఉండటం జనార్దన్ రెడ్డికి కొండంత బలాన్నిస్తుంది.



నెల్లూరు ఇందిరాభవన ప్రవేశోత్సవంలో జనార్దనరెడ్డి ప్రక్కన రాజీవ్‌గాంధి

### రాజధాని లేఖ

## శీనయ్య మౌనవ్రతం వెనుక ఆంతర్యం

శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి బహిరంగంగా పత్రికలకెక్కకుండా మౌనంగా వుంటున్నారు. తన చిరకాల ప్రత్యర్థి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి ముఖ్యమంత్రి కావడంతో శీనయ్య బహిరంగంగా ధ్వజమెత్తుతారని అందరూ అనుకున్నారు. అయితే శీనయ్య మాత్రం ఇందుకు విరుద్ధంగా బయటికి నోరు విప్పకుండా తన అంతరంగికులు, సన్నిహితుల వద్ద జనార్దన రెడ్డిపై ఆడిపోసుకుంటున్నారట. శీనయ్య తాజా రాజకీయ వ్యూహం ప్రకారం మూడు నెలంపాటు నోరువిప్ప రాదని శపథం చేశారట. ఈ మూడు నెలల్లో జనార్దనరెడ్డి తనంతతానుగా ఏదో ఒక పదవి ఇస్తేసరి. లేకపోతే సహజ ధోరణిలో విమర్శలు కురిపిస్తారట. శ్రీ మాగుంట రవీంద్రనాథ్

కొరవ 13 పేజీలో

## ముఖ్యమంత్రిత్వపు ముద్రపడాలి!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దన రెడ్డి 20వతేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత ఎందరో ముఖ్యమంత్రులు, ఎన్నోసార్లు నెల్లూరు వచ్చారు, పోయారు. కాని ఒక నెల్లూరీయుడు నెల్లూరుకు ముఖ్యమంత్రి హోదాలో రావడం ఈ నలభైఏళ్ళలో ఇదే మొదటిసారి. సమీప భవిష్యత్తులో ఇటువంటి సగర్వ సంఘటన మళ్ళీజరిగే అవకాశం కూడా లేదు. అందువల్లే సింహపురి మండలం సమస్తం జనార్దనరెడ్డి గారికి పులకితాంతరంగమై స్వాగతిస్తున్నది; నెల్లూరు నగర కాంత, నిలువెల్లా నవ్వులతో, నిండు మనస్సులతో ఆహ్వానం పల్కుతున్నది. ముఖ్యమంత్రి పదవిలోని మహత్వం గొప్పదో లేక ఆ పదవి స్వీకరించిన జనార్దన రెడ్డి గారి జాతకం మహిమాన్వితంగా మారిందో గాని, ఆయన రాకను ఒక చరిత్రాత్మక సంఘటనగా ఇంటింటా సృష్టించే పండుగగా సందడి భావిస్తున్నట్లున్నారు జనం. ఆయన వచ్చేరోజు కోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. ఎక్కడ నలుగురు చేరినా ఆయన పర్యటనా విశేషాలే ముచ్చటించు కుంటున్నారు. ముఖ స్తుతిగా చెప్పడం కాదు; అతిశయోక్తులు పల్కడం కాదు; అతిగా వర్ణించడం కాదు. గత నాలుగు రోజుల నుంచి నెల్లూరులో వున్న వాతావరణం ఇది. ఎవరో కల్పిస్తే సృష్టిస్తే పుట్టుకొచ్చిన ఉత్సాహపూరిత వాతావరణం కాదిది. గత పదారేళ్ళుగా జిల్లా ప్రజలలో జనార్దనరెడ్డి తనకు తానుగా పెంచుకున్న మంచితనం ఫలితం ఇది. పదవులతో నిమిత్తంలేకుండా ప్రజలతో కలసి మెలసి తిరిగిన ఫలం ఇది జనార్దనరెడ్డి పర్యటనను ఒక మరపురాని మధుర సంఘటనగా, చిరకాలం గుర్తుండిపోయే కార్యక్రమంగా తీర్చిదిద్దడానికి కాంగ్రెస్‌వాదులు, అధికార్లు శక్తివంచన లేకుండా శ్రమిస్తున్నారు. డబ్బుకు, శ్రమకు ఎవరూ వెనుకాడడంలేదు. నాయకులు, అనుచరులకంటే అధికారుల సందడే ఎక్కువగా వుంది. ఇందరు ఇన్ని రకాలుగా స్వాగతించడం, ఆదరం చూపడం కూడా జనార్దనరెడ్డికి ఒక విధంగా భారం కల్గించే విషయమే! ఆయనపట్ల ఆదరం చూపే వారందరిలోనూ ఆయన వల్ల తమకేదో మేలు జరుగుతుందని ఆశవుంది. ఆయన రాకకు జనం ప్రదర్శించే ఆత్రుత వెనుక తమ బాగుకోరేపనులు చేసెడతాడన్న ఆకాంక్ష వుంది. ఆయన అనుచరులలోనే కాదు, ఆయనతో ఏ సంబంధమూ లేని సామాన్య ప్రజానీకంలోనూ జనార్దనరెడ్డి తనకు తెలియకుండానే ఆశలు రేకెత్తించాడు.

ఈ పరిస్థితులలో ఆయన ఊరక వచ్చిపోతే ఎవరూ ఒప్పుకోరు. తన ముఖ్యమంత్రిత్వం ముద్ర జిల్లాపై స్పష్టంగా, ప్రబలంగా, ప్రగాఢంగా పడే పనులు చేసి పెడతానన్న హామీ ఇస్తేనే; వాటిని అణుమాత్రం తేడా లేకుండా అమలు చేస్తేనే వేడుకగా జరుగుతున్న ఈ పర్యటన వైభవం సంతరించుకుంటుంది.

కొరవ 24 పేజీలో





# పినాకినీ తీరం

## స్వాగతం

ముఖ్యమంత్రిగా తొలి సారిగా నెల్లూరు వస్తున్న నేదురుమల్లి జనార్ధనరెడ్డికి నెల్లూరు మండలీయులందరూ స్వాగతం పలుకుతారు. మొదటిగా అడుగు పెడుతున్నది నెల్లూరులో కాబట్టి సింహపురీయులు ప్రత్యేకంగా స్వాగతం చెప్తారు. కాని మేము మాత్రం జనార్ధన రెడ్డి తన అధికార పర్యటనలో జమీన్ రైతు 'కార్యాలయం'సందర్శనను ఒక కార్యక్రమాన్ని చేశారు. కాబట్టి హృదయద్వారాలు తెరచి వారికి స్వాగతమిస్తున్నాము.

శ్రీజనార్ధన రెడ్డికి జమీన్ రైతు ఆఫీసు కొత్తకాదు ఆయన మా ఆఫీసుకు రావడం కొత్తకాదు ఏ పదవీ లేనప్పుడు,రాజ్యసభ సభ్యుడైనప్పుడు మంత్రిగా ఎదిగినప్పుడు జమీన్ రైతుకు వచ్చిపోవడం ఆయనకు అలవాటు. ముఖ్యమంత్రి అయినా ఆ అలవాటుకు ఆయన స్వస్తి చెప్పక పోవడం విశేషమే.జమీన్ రైతు జనార్ధనరెడ్డి మధ్య సంబంధం అధికారాలు ,అంతస్తులు,అనుకూల ప్రతికూలతల కతీతంగా నేటివరకు నిత్యమై,నిఖిలమై సుదృఢంగా నిలబడి పోయింది. మామూలు జనార్ధనరెడ్డిగా ఎంతగా స్నేహసౌహార్ద్ర హస్తాలు చాచామో ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డికి అంతటి గౌరవాభిమానాలతో స్వాగతం చెప్పగలగడం ఎంతటి ఆనందదాయకమైన విషయం!

జమీన్ రైతుకు గతంలో అనేకమంది మంత్రులు, ఇతర ప్రముఖులు వచ్చారు గాని, ముఖ్యమంత్రి ఎవ్వరూ రాలేదు.

శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారు 1953లో కర్నూలులో ముఖ్యమంత్రి అయ్యారు గాని ,జమీన్ రైతును తొంగి చూసినట్టు లేదు.మద్రాసు రాష్ట్రంలో రెవిన్యూమంత్రిగా చరిత్రాత్మకమైన జమీన్దారీ రద్దు శాసనాన్ని దేశంలోనే మొదటిగా చేయగలిగిన కళావెంకటరావు గారిని రామానాయుడుగారు జమీన్ రైతులో విందులో గౌరవించారు. బహుశా శ్రీదామోదరం సంజీవయ్యగారి మంత్రివర్గంలో వున్నప్పుడు కాబోలు శ్రీపిడతల రంగారెడ్డిగారు జమీన్ రైతుకు ఉపాహారవిందుకు వచ్చారు. 'పూరకే రావడం కాదు పోతూ పోతూ జమీన్ రైతును నీవు ఏమి అభివృద్ధి చేశావు అని నిలదీసి అడిగాడు.తన వల్ల ఏమి సహాయం కావలసినా చేయగలనన్నారు. మరచి పోలేని ఔదార్యపు మాట అది. రంగారెడ్డిగారు పత్రికా విలేఖరిగా వుండి రాజకీయాలలో పైకి వచ్చిన వారు. అందువల్లే పత్రికం పెట్ల ఆయనకు అంతటి ప్రత్యేకాభిమానం. రైతోద్యమంలో వుండి మంత్రులైన శ్రీకందుల ఓబులరెడ్డి, కీర్తిశేషులు తిమ్మారెడ్డి గారలు పిలవకుండా అనేకసార్లు వచ్చిన మంత్రులు. జమీన్ రైతుకు మొదటగా వస్తున్న ముఖ్యమంత్రి శ్రీ జనార్ధనరెడ్డిగారే.

జనార్ధనరెడ్డిగారి కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్న అధికారబృందంలోని ఒక ఉన్నతాధికారి 'జమీన్ రైతు'ను సందర్శించి ఒక చారిత్రక స్థలాన్ని చూసినట్లుగా వుందని వ్యాఖ్యానించారట; ఆఫీసులోని టేబిళ్ళు,కుర్చీలకు కూడా అరవై ఏళ్ళ వయస్సు వుందా! అన్నారట.ఆయన వున్నమాటన్నారు. పూర్వం తాలూకాఫీసు, కలెక్టరాఫీసుల్లోని కొయ్య కుర్చీల్లో గుమాస్తాలు కూర్చుని. కూర్చుని అడుగు భాగం అట్లనే అచ్చుగుద్దినట్లు గుంటబడి వుండేవి.జమీన్ రైతులోని పర్నిచరు మరీ అంత అధ్వాన్నమైనది. కాదుగాని, ప్రభుత్వ కార్యాలయాలు, పెద్ద పెద్ద పత్రికల ఆఫీసులలో వలె ఆధునికమైనదీ కాదు.బహుశా జమీన్ రైతు భవనం వయస్సు నెల్లూరు కలెక్టరాఫీసుకంటే పెద్దదిగానే వుండవచ్చు. గాజులబేరంగా వున్న చిన్న పత్రికల దుస్థితికి జమీన్ రైతు అన్నివిధాలా ఒక ప్రతీక.

ఆ అధికారి అన్నట్లు జమీన్ రైతు పత్రిక, కార్యాలయం చారిత్ర కాలే! రాష్ట్రంలో జమీన్దారీల రద్దును సాధించింది జమీన్ రైతు.ఉమ్మడి మద్రాసు, ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ శాసనసభలకు 1937 మొదలు 1990 వరకు పదకొండు సాధారణ ఎన్నికలు జరిగితే, తొమ్మిదింటిలో ముఖ్యంగా జిల్లాలో కాంగ్రెస్ పతాకం రెపరెపలాడుటకు దోహదకారి అయింది. కాంగ్రెస్ ఢంకా మ్రోగించింది జమీన్ రైతు;1934 సెంట్రల్ అసెంబ్లీ ఎన్నిక మొదలు మొన్నటి వరకు ప్రతి పార్లమెంట్ ఎన్నికలోనూ - ఒక్కసారి తప్ప కాంగ్రెస్ దిగ్విజయానికి ఉడుతా రీతి తోడ్పడింది జమీన్ రైతు; మద్రాసులో మంత్రిగా, ఆంధ్రలో ముఖ్యమంత్రిగా ,యూనియన్ క్యాబినెట్ మంత్రిగా, ఉత్తర ప్రదేశ్ గవర్నర్‌గా చేసిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి అండగా నిల్చింది- జమీన్ రైతు; జనార్ధనరెడ్డిని రాజ్యసభ సభ్యుడుగా మొదలు ముఖ్యమంత్రి వరకు చూచి మురిసి పొంగలుగుతున్నది జమీన్ రైతు. ఆపాతభవనంలో కాలదోషం పట్టిన ట్రెడిల్ ప్రింటింగ్ ప్రక్రియతో, ఆపాత వాతావరణంలో ఇంత సుదీర్ఘ కాలం సజీవంగా వుండి ,సేవ చేయగలగడం చరితార్ధమే అవుతుంది.

అరవైఏళ్ళు నిండాయి కాబట్టి, 'జమీన్ రైతు' కూడా షష్టిపూర్తి పెండ్లికూతురుగా కొత్త రూపు సంతరించు కుంటుందేమో చూడాలి!

జనార్ధనరెడ్డి గారు జమీన్ రైతు గుమ్మంలో అడుగు పెట్టేవరకు ముఖ్యమంత్రి; ఆ సిమ్మట జమీన్ రైతు అభిమాన మిత్రుడు. ఆ జమీన్ రైతు శ్రేయోభిలాషికి మరొకసారి హార్దికంగా స్వాగతం చెప్తున్నాము

## అప్పుడప్పుడు వస్తుంటే!

ముఖ్యమంత్రిగా శ్రీ జనార్ధన రెడ్డి తరచు నెల్లూరుకు వస్తుంటే ఎంత బాగుంటుంది అనిపిస్తుంది. ముఖ్యమంత్రి కార్యక్రమం ధృవీకరణైన క్షణం నుండి అన్ని ప్రభుత్వ శాఖలు యుద్ధ ప్రాతిపదికమీద తాము తీసుకోవలసిన జాగ్రత్తలకు, చేయవలసిన పనులకు ఉపక్రమించాయి. ముఖ్యమంత్రిగారి కారు పోయే మార్గ రూపురేఖలే రాత్రికి రాత్రే మారిపోతున్నాయి. అన్నింటి కంటే ముందు చెప్పుకోవలసింది నరక ప్రాయంగా వున్న రోడ్లు చాలంతటవి బాగుపడిపోతున్నాయి. విద్యుత్ స్తంభాలు సైతం రంగులు పూసుకొని ముస్తాబవుతున్నాయి. ముఖ్యమంత్రి పుణ్యాన కలెక్టరు తదితర అధికార్లు ముండ మోపిందను కున్న నెల్లూరు మునిసిపాలిటి నొసట తిలకం దిద్దుతున్నారా అనిపిస్తున్నది.

నిన్నమొన్నటి వరకు మంత్రిగా కూడా వందలు వేల సార్లు తిరిగిన నెల్లూరే ఇది. అరోడ్లే, ఆ అధికార్లే, ఆ ప్రజలే. కాని ఒకే ఒక్క నెలలో అదే జనార్ధనరెడ్డి వస్తున్నాడంటే ఎంత సంచలనమో చూడండి. ముఖ్యమంత్రిత్వ పదవి లోనే కాదు, ముఖ్యమంత్రిగా జనార్ధన రెడ్డి గారిలో వున్న జనము , జీవము, ఛిద్రు, భేషజాలవి!

## సభ అవసరమా ?

20వ తేది వి.ఆర్. కాలేజి మైదానంలో ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డి రాక సందర్భంలో బహిరంగ సభ

కొరవ 12 పేజీలో

జమీన్‌రైతు

# త్యాగాలకు సిద్ధంకండి!

ఇరాక్ యుద్ధం మొదలైపోయింది.ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని తృణప్రాయంగా ఎంచిన సద్దాం హుసేన్ పై అమెరికా దాడి ప్రారంభించింది.సింధుశాఖలో మానవ మారణహోమం ఆరంభమైంది. పుష్కలమైన పెట్రోల్ సంపదతో కళ్ళుపొరలు గ్రమ్మిన ఒక నియంత పొగరు దించడానికి, ప్రపంచంయావత్తు తమ భవిష్యత్‌నే పణంగా పెట్టిపోరాడవలసిన దౌర్భాగ్యం సంప్రాప్తించింది.

16 తేది రాత్రి, ఐక్యరాజ్యసమితి ఇచ్చిన గడువు ముగిసిన పదిహేడుగంటల తర్వాత మిత్రదేశాల సైన్యం ఇరాక్ రాజధాని బాగ్దాద్‌పై తొలిబాంబు వేసింది. అమెరికా అధ్యక్షుడి నుంచి గ్రీన్ సిగ్నల్ అందిన మరుక్షణంలో సౌదీ అరేబియా సరిహద్దులలో పొంచి వుండిన యుద్ధవిమానాలు- శృంఖలాలు త్రెంచుకున్న గండభేరుండ పక్షులలాగా రివ్వున ఆకాశంలోకి ఎగిరాయి. ఇరాక్ స్థావరాలపై బాంబులవర్షం కురిపించాయి. ఆ తర్వాత ఆరేడు గంటలకు సద్దాంహుసేన్ మూకక్షిపణుల ప్రయోగం ప్రారంభించింది. ఒక్క రోజు వ్యవధిలోనే కొన్ని వేలకోట్లరూపాయలు విలువచేసే సంపద ధ్వంసమై పోయింది. యుద్ధం ముగిసేలోగా ఎంతటి మానవసంపద నిర్జీవమౌతుందో, ఎన్ని లక్షల కుటుంబాలు కకావికలైపోతాయో, ఎన్ని దేశాల ఆర్థిక పరిస్థితి చితికి శిథిల మౌతుందో తల్చుకుంటే హృదయం నీరవమౌతుంది.

సద్దాం హుసేన్ సాధారణ నియంతకాదు. హిట్లర్‌ను తలపింపజేసే కఠినమనస్కుడు.తనమూర్ఖ నిర్ణయాలకు తన ప్రజలే శలభాల్లా మాడిపోతున్నా పట్టినపట్టు వదలని మూర్ఖశిఖామణి.మొండిమనిషి. అందువల్ల కేవలం జననష్టం,ఆస్తినష్టం ఆయిల్ స్థావరాల ధ్వంసంతో అతడు లొంగివస్తాడని, ప్రపంచప్రజలు చెప్పే బుద్ధిమాటలు వింటాడని ఆశించలేము. కాళ్ళుచేతులు ఆడనిపరిస్థితి వచ్చేవరకు సద్దాం హుసేన్ పోరాటం ఆగదు.అతడికున్న సైనిక పాటవం అపారమైనది. అమిత శక్తివంతమైనది. అందువల్ల అతడ్ని లొంగదీయడం అంత సులభతరంకాదు.ఎన్నిరోజులు, ఎన్నినెలలు ఈయుద్ధం జరుగుతుందో, ఎంత విధ్వంసానికి దారితీస్తుందో ఎవరు ఊహించలేకున్నారు.

మోకాలిమీద తంతే మూతిపళ్ళు రాలినట్లు ఎక్కడో సింధు శాఖలో సమరం ప్రారంభమైతే, ఇక్కడ ఇండియాలో గందరగోళం చెలరేగుతున్నది. భారత ఆర్థిక వ్యవస్థకు గల్ఫ్ ఆయిల్ ప్రాణవాయువువంటిది. పేరుకు సువిశాల దేశమైనప్పటికీ , సహజ వనరుల కాణచిగా పేరుపొందినప్పటికీ, మనకాళ్ళమీద మనం నిల్చేందుకు తగిన పెట్రోలు మనకులేదు. ఆ ఎడారులలో రాజకీయ అస్థిరత ఏర్పడినప్పుడల్లా ఇక్కడ ఊపిరాడని పరిస్థితి సాక్షాత్కరించడం అలవాటే. కువైట్ నుంచి ఆయిల్ సరఫరా ఆగితేనే అతలాకుతలమైపోయిన బలహీన ఆర్థిక వ్యవస్థ మనది. ఇప్పుడు బొట్టు ఆయిల్ భారతతీరం చేరే అవకాశంలేదు. మలేషియా వంటి దేశాలు ముందుకు వచ్చినప్పటికీ ,వారితో ఒప్పందాలు కుదుర్చుకోవడం, వారి ముడిచమురుకు అనుగుణంగా మన రిఫైనరీలను మరమ్మత్తు చేయడం అంత సులభంగా అయ్యేపనికాదు .

ఈ పరిస్థితులలో భారత పజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి త్యాగాలకు సిద్ధమైతేతప్ప, దేశమనుగడ స్థిరంగాసాగదు. యుద్ధంసమసి పోయేవరకు దేశప్రజానీకం తమఅవసరాలు తగ్గించుకొని, విలాసాలు మానుకొని ,పెట్రోలు,డీసెల్ వాడకాలను పరిమితంచేసుకొని దేశంపైవున్న భారాన్ని ఉడతాభక్తిగాతగ్గించడానికి సమాయత్తంకావాలి.యుద్ధ వాతావరణాన్ని ఆసరాగా తీసుకొని బ్లాక్ మార్కెట్‌వంటి కక్కుర్తి పనులకు పాల్పడే వ్యాపారులను జాతి విద్రోహులుగా గుర్తించి ప్రజలే బుద్ధి చెప్పాలి. వస్తువుల ధరలు అదుపులో వుంచడానికి ప్రభుత్వంతీసుకునే ప్రతి చర్యనూ హృదయపూర్వకంగా సమర్థించాలి. ప్రపంచమే ఆపదలోపడిన ఈ విపత్కర సమయంలో, లేనివాటిని తల్చుకొని చింత పడకుండా వున్నవాటితో సర్దుకొని, ఆత్మ విశ్వాసంతో సమస్యలను ఎదుర్కొని, ఒక జాతి ప్రజగా మన ప్రవర్తనను ప్రపంచం హర్షించే రీతిలో వ్యవహరించ గలగాలి.

---

జమీన్‌రైతు

16-1-1941

12 పేజీలు అణా

## డా॥ మూర్తిగారికి రు 50 జుల్మానా

సెక్షన్ 417 ఐ.పి.పి. ప్రకారము గుంటూరు స్పెషనరీ సబ్ మేజిస్ట్రేటు గారు 3-1-1941 తేదిన డాక్టర్ యం.యస్. మూర్తి, బ్రాంకురోడ్డు, నెల్లూరుగారికి రు 150 లు జరిమానా లేకుంటే 6 వారాలు కఠిన శిక్ష విధించారు.

కేసు వివరం: తే 15-4-40 న ఏషియన్ ఇన్సూరెన్సు కంపెనీవారి ఆర్గనైజర్ హోదాలో రు 40 లు ప్రీమియర్ బ్యాంకు నెల్లూరుకు చెక్కు వ్రాసి పొనువరపు వెంకటరెడ్డి (పాలిరెడ్డి పాళెం) గారికి మూర్తిగారిచ్చారు. బ్యాంకులో పైకం మూర్తిగారు డిపాజిట్ చేయనందున రెండుమార్లు చెక్కు తిరగ్గొట్టబడింది. బ్యాంకులో డబ్బు ఉన్నదని చెప్పి వెంకటరెడ్డిగారి చేత "ప్రపోజల్స్" స్వీకరింపజేసి ఆయన్ని విధంగా మోసంజేసి నందుకు ఏషియన్ ఇన్సూరెన్స్ కంపెనీ బ్రాంచి మేనేజరు (గుంటూరు) మూర్తిగారిపై కేసు దాఖలు చేసారు.

## కడపటి సత్యాగ్రహ వార్తలు

### చీళ్ళ గురునాథం ఆరెస్టు

వెంకటగిరి ఏరియాసత్యాగ్రహ సంఘాధ్యక్షులును నెల్లూరు జిల్లా జమీన్ రైతు సంఘ ప్రధాన కార్యదర్శినగు శ్రీ చీళ్ళ గురునాథంగారు 16-1-41 తేది ఉదయం 11-30 గంటలకు వెంకటగిరిలో పాతకోట సమీపంలో 500 మంది జనం ఎదుట సత్యాగ్రహం చేసారు. యస్.ఐ. వారిని అరెస్టుచేసి నెల్లూరు రూరల్ స్టేషనులో వుంచి 17-1-41 నెల్లూరు డిప్టీకలెక్టరు జోనఫ్‌రెడ్డిగారి కోర్టులో విచారించి 3 నెలల కఠినశిక్ష జుల్మానా రూ 100లు చెల్లించకపోతే మరి 6 వారాలు శిక్ష విధించబడింది. వీరిని నెల్లూరు సబ్ జైలులో వుంచెదరు.

**50 ఏళ్ళక్రితం ఈ వారం**

## బద్దెవ్రూడి వెంకటనారాయణ రెడ్డిగారి విడుదల

వీరిని తిరుచునాపల్లి సెంట్రలు జైలులో 16 తేదిన విడుదల చేసిరి. వీరికి గూడూరు సబ్ కలెక్టరుచే 18 తేది డిస్ట్రిక్ట్ బోర్డు మీటింగుకు అప్పుడే నోటీసు పంపించ బడెను.

## రంధ్రాన్వేషి

ఇవన్నీ అధికారాన్ని శాస్త్రరీత్యా జరిపితే కలిసేకుక్కమూతి బిడ్డలే.

కోట ప్రాంతీయుడు ఒక పురానా రెడ్డి ఓటర్ల లిస్టులో - స్త్రీ- అని పడినాడు. ఆయన సవరణకు అర్జీ పెట్టుకొనగా అధికారి

" మీరు స్త్రీ కాదని రుజావు చేయగలిగిన సాధనాలతో పలానా తేది మా ఆఫీసుకు హాజరు కావలసింది అని తాకీదు జారీ చేసినాడు. రెడ్డిగారు ఏమేమి తీసుకొని పోయినారో ఆ ఎలక్షన్ ఆఫీసరుకే తెలిసివుంటుంది.

---

# మానవతామూర్తి డాక్టర్ బేర్

ఎందరి జీవితాలకో ప్రాణ ప్రదానం చేసిన డాక్టర్ బేరమ్మ అమెరికా వెళ్తున్నారన్న మాట వినగానే కన్నీటి బొట్లు జలజల రాలాయి. రోగులపట్ల ఆమె ప్రదర్శించే ఓర్పు, సహనం, సాటి డాక్టర్లపట్ల చూపే గౌరవం, ఆహ్లాందాతనం, మరి ఏ ఇతర డాక్టర్లకూ రాదేమో! డబ్బుకోసం చదువును తాకట్టు పెట్టి, ఇతర దేశాలకు వలసవెళ్తున్న డాక్టర్లు మనలో వేలాదిమంది వుండగా, సేవకోసం తమ సంస్కృతీ సాంప్రదాయాలను విడచి పరాయి దేశంలో మూడున్నర దశాబ్దాలు సేవే పరమావధిగా గడిపిన మహోన్నత డాక్టర్ బేరమ్మ.

గూడూరు - ఎ. బాలసుబ్రహ్మణ్యం

## జనార్దనరెడ్డికి అభినందనలు

1964 లో 25 వ ఆంధ్రా బెటాలియన్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా వున్నప్పుడు నాకు శ్రీజనార్దనరెడ్డి గారిని కలిసే అవకాశం చిక్కింది. అప్పుడాయన విద్యానగర్ సంస్థలకు కరస్పాండెంట్. అప్పుడు ఏ నిరాడంబరతం, దైనమిజం వుండినాయో, ఇప్పుడూ శ్రీజనార్దన రెడ్డిలో అవే వున్నాయి. నాకాడు సంస్థలలో రెండు వేల మంది పేద పిల్లలు అరగంట వ్యవధిలో ఎవరికీ ఎటువంటి అంతరాయం కల్గకుండా, భోజనం చేసే దృశ్యం ఈనాటికీ నా కళ్ళముందు మెదులుతూవుంది. జనార్దనరెడ్డి గారి సమర్థతకు, సేవా దృక్పథానికి అదొక మరపురాని నమూనా. తన రాజకీయ జీవితంలో తన దైన శైలిలో ప్రవర్తించి, మొత్తం ఆంధ్రప్రదేశ్‌లోనే తనకంటూ ఒక స్థాయిని, హుందాతనాన్ని సంతరించుకున్న వారాయన. చౌకబారుతనానికి ఆయన పదకోశంలో స్థానంలేదు.

కల్పించే శ్రీజనార్దనరెడ్డి తన నూతన బాధ్యత నిర్వహణలో విజేయుడు కావాలని ఆకాంక్షిస్తున్నాను.

- కెప్టెన్ ఎ.రామస్వామినాయుడు,
హైదరాబాదు రిటైర్డ్ ప్రిన్సిపల్

## జనవాణి

సమస్యల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతున్న ఆంధ్రప్రదేశ్‌కు రాజీవ్‌గాంధీ సరైన సమయంలో సరైన నాయకుడ్ని సారథిగా నియమించాడు. మాటలు తక్కువ, చేతలు ఎక్కువగా

## గూడూరులో అడిషనల్ జిల్లాకోర్టు పెట్టాలి

నెల్లూరు జిల్లాకు ఒకే ఒక అడిషనల్ జిల్లాకోర్టువుంది. ప్రక్కనే వున్న

కారవ 16 పేజిలో



క్లిష్టసమయంలో, తాత్కాలికమైన లాభానికి ఆశపడక
తను నమ్మిన పార్టీకి విధేయుడై, అందుకు ప్రతిఫలంగా
ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి పదవి సలంకరించిన

# శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిగారు

ముఖ్యమంత్రిగా మొట్టమొదట నెల్లూరుకు
విచ్చేయు సందర్భంలో మా హృదయపూర్వక

## శుభాకాంక్షలు

యల్. శ్రీనివాసులురెడ్డి
చారిస్మా ప్రింటర్స్
హైదరాబాద్

# నూరురోజుల్లో టెలిఫోన్ సమస్యలు పరిష్కరిస్తారట!

నెల్లూరు టెలిఫోన్ సమస్యల పరిష్కారానికి డిజిటి శ్రీ ఎం.ఎస్.నాయుడు, ఒక నూరురోజుల కార్యక్రమం ప్రారంభించారు.జనవరి 1 తేది నుంచి నూరురోజుల గడివేలోగా పరిష్కరించవలసిన సమస్యలన్నింటినీ స్పష్టంగా నిర్దేశించి, అధికారులను పురమాయించారాయన.

పాడైకాలంతీరిన టెలిఫోన్లన్నింటినీ మార్చి పుష్బటన్ ఫోన్లు బిగించడం,టెలికాంబ్యూరోలు,పబ్లిక్‌కాల్ ఆఫీసులు అవసరమైనదగ్గరల్లా తెరవడం, తప్పుడు బిల్లులు, రీఫండ్ కేసులను త్వరితంగా పరిష్కరించడం, టెలిఫోన్ట్రాన్స్‌వర్‌లను వెంటనే చేపట్టడం, సాంకేతికంగా నిరుపయోగమైన టెలిఫోన్లను తొలగించడం వంటివి ఈ నూరురోజులలో పూర్తి చేస్తారు. దానితోపాటు కొత్త సర్వీసులు ప్రవేశపెట్టడం, గ్రామీణ ప్రాంతాలకు ఫోన్‌సౌకర్యాన్ని విస్తరించడం, వెయిట్‌లిస్ట్‌లను తగ్గించడం.వంటి పనులపై కూడా శ్రద్ధ పెట్టి పనిచేస్తారు. ఈ కార్యక్రమంలో భాగంలో ఫాల్ట్ రిపోర్టుకోసం కొత్త టెలిఫోన్లు కేటాయించారు?నెల్లూరు-23617, కావలి-429, గూడూరు-479 నంబర్లకు ఫోన్‌చేసి చెప్తే ఏరిపేరైనా వెంటనే చేపడతారు. ఈఫోన్‌కు బిల్‌పడదు.

మొత్తంమీద శ్రీనాయుడుగారు టెలిఫోన్‌శాఖను ప్రజలకు చేరువచేయడానికి ఉడుతాభక్తిగా కృషి చేస్తున్నారు.నాయుడుగారు యువకుడు. ఏదో చేయాలన్న తపన, ఉత్సాహం కల్గినవాడు. టెలిఫోన్‌శాఖ అంటే ప్రజలలో వున్న చులకన భావం, నిరసనభావాలను సాధ్యమైనంతగా తొలగించాలని ఆయన ప్రయత్నం. క్రింది అధికారులు, సహకారం అందచేస్తే ఆయన కృషి ఫలిస్తుంది.

## సింహపురి

### టింబర్ మర్చంట్ల సంఘం

నెల్లూరు టింబర్ మర్చంట్స్ అసోసియేషన్‌కు కొత్తకార్యవర్గం ఏర్పాటైంది. అధ్యక్షుడుగా శ్రీ జి.వి.రమణయ్య,ఉపాధ్యక్షులుగా శ్రీ ఎం.వెంకటరెడ్డి, శ్రీ ఎస్.గోపినాథసెట్టి, కార్యదర్శిగా శ్రీ వి.వెంకటసుబ్బయ్య, సహాయ కార్యదర్శిగా శ్రీ ఇమ్మిరెడ్డివెంకటేశ్వర్లు కోశాధికారిగా శ్రీ వాకాటి పాండురంగయ్య కార్యవర్గ సభ్యులుగా శ్రీ కేశవలాల్ పటేల్,జి.వెంకటేశ్వర్లు,సయ్యద్ గౌస్‌బాషా,శంకర్‌పటేల్,డి.వెంగయ్య,వాకం సుబ్బారావు,షరాబు పెంచలయ్య,ఎ.వి.కృష్ణయ్య,టి.చంపతిరావు ఎన్నికైనారు.

### జియ్యర్‌స్వామి గోదాదేవి కళ్యాణం

ధనుర్మాసం ముగింపు సందర్భంగా శ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణజియ్యర్ స్వామి, 14 తేది ఇందిరాభవన్లో గోదాదేవి కళ్యాణం ఘనంగా జరిపించారు.తర్వాత స్వామివారు తన భక్తులతోకలిసి ట్రంకురోడ్డులో పాదయాత్రజరిపి, ఏసి బొమ్మవద్ద ఉపన్యాసం చేశారు.

కొరవ 20 పేజీలో

## ఉత్తరక్రియలు



జననం 9-11-1920 మరణం 7-1-1991

**నాగారెడ్డి పేరారెడ్డిగారు**

పెద్దచెరుకూరు

7-1-91 తేదీ సోమవారం రాత్రి 9గంటలకు స్వర్గస్థులైనారు, వారికి దైవసన్నిధిలో చిర శాంతికలగాలనిప్రార్థిసూ వారి ఉత్తరక్రియలు

23-1-91 తేదీ రాత్రి నిలుపు

24-1-91 తేదీ ఉదయం ఎత్తురేవు, పొత్తర్లు

పెదచెరుకూరులో మా స్వగృహమున జరుగును

బంధుమిత్రులు తెలియగోరుతున్నాము.

నాగారెడ్డి వెంకటసుదాకరరెడ్డి-సుచంద్రిక
కొడుకు-కోడలు

దేవిరెడ్డి విష్ణుప్రసాదరెడ్డి-సుప్రియ
అల్లుడు - కుమార్తె

## ●●● ఉత్తర క్రియలు



జననం : 16-6-1949 మరణం : 11-1-1991

మేనేజింగ్ పార్ట్‌నర్ : బాలాజీ ఏజెన్సీస్, ఇండస్ట్రీస్, నెల్లూరు.

వాసవీ కోల్డ్ స్టోరేజి ప్రై.లి. నెల్లూరు.

యస్.వి. ఇండస్ట్రీస్ - నెల్లూరు.

పినాకినీబెవరేజెస్ ప్రై.లి- గుడ్డిపల్లిపాడు

హోటల్ శివం ఇంటర్నేషనల్ ప్రై.లి. - నెల్లూరు.

నెల్లూరులో ప్రముఖ పారిశ్రామికవేత్త

**యడ్లపల్లి సుధాకర్ గారు**

(యడ్లపల్లి వెంకటేశ్వర్లుగారి కుమారుడు)

అకస్మాత్తుగా మృత్యువాత బడిమమ్ములుపుస్తెడు దుఃఖమున ముంచి వెళ్ళినారు. వారికి దైవసన్నిధిలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ

వారి ఉత్తరక్రియలు

25-1-91 తేది శుక్రవారం

26-1-91 తేది శనివారం

నెల్లూరు, నవలాకులతోట, యస్.వి ఇండస్ట్రీస్ (ప్రతివారితోట ఎదురుగా) నందు జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

తల్లి : యడ్లపల్లి అనసూయమ్మ

కుమారుడు : యడ్లపల్లి సంజయ్

భార్య : యడ్లపల్లి ప్రమీల

సోదరుడు : యడ్లపల్లి శ్రీనివాసరావు (సురేష్)

వదినె : యడ్లపల్లి అమృతవల్లి

కుమార్తెలు : సుషుమ , స్వాతి.





రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ప్రతిష్ఠను
ఇనుమడింప జేసి, స్వశక్తితో
పైకి వచ్చిన మన నెల్లూరీయుడు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

## శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిగారు

తనను నమ్మి, పార్టీకి సేవజేసిన,
నాయుడుపేట మండలాధ్యక్షుడు
మాకు ముఖ్యుడు

## శ్రీ చదలవాడ కృష్ణమూర్తి గారికి

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిత్వాన్ని
అందజేసి నందుకు **కృతజ్ఞతాంజలి** అర్పిస్తూ,

ఎ.పి.సి.సి. కార్యదర్శి పదవినలంకరించిన
చదలవాడ కృష్ణమూర్తిగార్కి
మా హృదయపూర్వక

# శుభాకాంక్షలు

అందజేస్తున్నాము

యస్ పుష్పరాజ్
సాయబాబా పిక్చర్స్ - నెల్లూరు.

## సణుగుడు

ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డిగారి స్వాగత ఏర్పాట్లలో జిల్లా యంత్రాంగం తలమునకలై పోయివుంది. ఉన్నతాధికారుల నుంచి, వారి అటెండర్లవరకు రాత్రింబవళ్ళు పనిచేస్తున్నారు. వేరే కార్యక్రమం లేదు. వేరేధ్యాసలేదు. వేరే ఆలోచనలేదు. ఎవరికీ క్షణమాత్రం విరామంలేదు. ఏడుకోట్ల ప్రజలకు ఏకైక ఏలిక అయిన నాయకుడు స్వంత జిల్లాకు వచ్చే సమయంలో. ఆయన్ను ఘనంగా స్వాగతించడం, ఆప్యాయంగా పలకరించడం, హార్దికంగా అభినందన చెప్పడం మిత్రుల, శ్రేయోభిలాషుల ధర్మం. ప్రభుత్వయంత్రాంగానికి అధినేత అయిన నాయకుడ్ని సర్వాధికారలాంఛనాలతో స్వాగతించడం అధికారుల కర్తవ్యం. అందువల్ల స్వాగత ఏర్పాట్ల విషయంలో ఎవర్నీ తప్పుపట్టవలసిన అవసరంలేదు.

కాని స్వాగత ఏర్పాట్లపేరుతో జరుగుతున్న మేకప్ కార్యక్రమాలను చూస్తుంటేనే నవ్వొస్తున్నది. జనార్దనరెడ్డిగారి కారు నడుస్తుందనుకున్న ప్రతిరోడ్డునూ అద్దంలాగా నున్నగా నీట్‌గా తయారు చేయడానికి ఆర్ అండ్ బి అధికార్లు పడుతున్న పాట్లు చూస్తుంటే జాలికలుగుతున్నది. రాత్రుళ్ళు దీపాలు పెట్టుకొని కూడా కంకరవరచి తారుపోస్తున్నారు. తారుపూస్తున్నారన్నా అతిశయోక్తి కాలేదు.

అసలు వీరింత తాపత్రయపడవలసిన అవసరంవున్నదా అన్నది నా సందేహం. జనార్దనరెడ్డి గారు నెల్లూరుకు కొత్తకాదు. నెల్లూరురోడ్ల మందరముదన్న పరిస్థితి తెలియనివారు

## డోలేంద్ర

కాదు. నెంక్రితం మంత్రిగా నెల్లూరు. తాను వచ్చినప్పుడు ఎత్తి కుదేస్తుండిన రోడ్లు. నెలతర్వాత తాను ముఖ్యమంత్రిగా వచ్చేటప్పటికి నున్నగా జారిపోయేటట్లు తయారైపోవడం చూసి ముగ్ధుడైపోతాడని నేననుకోను. జనార్దనరెడ్డి గారు ఆకాశంలో విహరించే నాయకుడు కాదు: నేలమీద జరిగే వాస్తవాలు వెయ్యికళ్ళతో కనిపెట్టి మెలిగే నాయకుడు. రాత్రికిరాత్రి తన చుట్టూవున్న పరిసరాలకు పౌడరద్ది, పేస్టులురుద్ది. మేకప్‌చేసి. సొగ్గావున్నట్లు భ్రమకల్గిస్తే ఉబ్బిపోయేవాడుకాదు-గుంటల రోడ్లు. గతుకుల వీదులు, దుమ్ము గెస్టుహౌస్‌లు యధాతథంగావుంచి. సెక్యూరిటి ఏర్పాటుకు లోటురాకుండా మాత్రం జాగ్రత్తపడివుంటే ఆయన ఎక్కువ సంతోషపడేవాడని నా అభిప్రాయం.

## ఎందుకీ హిపోక్రసీ?

ముఠికిగుంటలను మానవ సరోవరాలుగా భ్రమింపజేయడానికి అధికారులు పడ్తున్న తాపత్రయం చూస్తుంటే - ఎందుకీ హిపోక్రసీ అన్పిస్తున్నది. స్వాగత ఆర్భాటాల రణగొణ ధ్వనులమధ్య ఇటువంటి సణుగుడులను విన్పించుకునేదెవరు?

• • • •

## ఎస్.పి.గారూ-ఈ ఆడపిల్లల గోడు వింటారా?

"ఈవ్ టీజింగ్" అనే అందమైన నామధేయంలో అమ్మాయిలను మానసిక యాతనకు గురిచేసే అనాగరిక యువకుల సంఖ్య పెరిగిపోతూంది నెల్లూరులో ! దారిన తలవంచుక నడిచిపోయే కాలేజి ఆడపిల్లలను వెంటాడడం, అనరాని, వినరాని పదజాలంతో వారిని మాటల హింసకు గురిచేయడం.. అలిపైతే జడపుచ్చ్య. సైటకొంగో పట్టిలాగడం. సైకిళ్ళతో ఢ్యాష్‌కొట్టడం. తమ వెకిలి చేష్టలతో ఆడపిల్లలు బెదరిపోయి. కళ్ళనీళ్ళు పెట్టుకుంటే. వెర్రిఆనందంతో ఎగిరి గంతులేయడం యువకులకు అలవాటైపోయింది. దారినపోయేకాలేజి అమ్మాయిలను ఎంతగా ఏడ్పిస్తే అంతటి హీరోగా పోజులు కొట్టేవారు పెరిగిపోతున్నారు.

టౌన్‌లోని చాలా రోడ్ల కూడళ్ళలో ఇటువంటి అల్లరిమూకల విశృంఖలత్వం కన్పిస్తున్నది. బాలాజీనగర్,సంకర అగ్రహారం ప్రాంతాలకు చెందిన కొందరు ఆడపిల్లలు అతిదీనంగా ఒక జాబువ్రాశారు. పొగతోటలో. ఎం జి బ్రదర్స్ లారీసర్వీసు ఆఫీసుకు ఆనుకొని బంకు ఒకటి వుందట. విజయమహల్ పరిసరాలలోనివారు రైలుకట్టదాటివచ్చే దారికి దరిగ్గా ఎదాశంవుందిబంకు. అక్కడ ఎప్పుడూ కోతిమూక ఒకటి చేరివుంటున్నదట. కాలేజీలకు, కోచింగ్ సెంటర్లకు, సినిమాలకు వచ్చిపోయే ఆడపిల్లలను ఏడ్పించడమే వీరి కార్యక్రమం. ఆరోడ్డులో ఎప్పుడూ లైట్లువెలగవు. చీకటిపడినతర్వాత ఆడపిల్ల కన్పిస్తేచాలు -పరమ అసభ్యంగా ప్రవర్తిస్తున్నారట. ఈరాక్షసుల పైశాచిక ప్రవర్తననుంచి తమను రక్షించమని ఆ అమ్మాయిలు అమిత దీనంగా వేడుకుంటున్నారు.

ఈఒక్కచోటనేకాదు - రామలింగాపురం, వి ఆర్‌కాలేజి బస్‌స్టాపు, వాకలివీధికూడలి, టౌన్‌హాలు దగ్గర, కోఆపరేటివ్ బ్యాంకు ఎదురు బస్టాపు, బాలాజీనగర్‌లో కాలేజికి వెళ్ళే ఆడపిల్లలు కాడిష్టం సైత్యానికి గురౌతున్నారు. ఈనీచులకు భయపడి కాలేజీలకు పోలేక ఇళ్ళల్లో వుండిపోతున్న ఆడపిల్ల లెందరో వున్నారు.

ఎస్ పి గారు మహోకరుకైన అధికారి అని పేరుంది. అది కేవలం ప్రచారమేనో లేక చేతల్లో, పనుల్లో సైతం ఆయన కరుకుగా వున్నారో నాకు తెలియదు. ఆయన తలచుకుంటే ఈఆడపిల్లల కళ్ళనీళ్ళుతుడవడం చిటికెలో పని. ఈ టీజింగ్ జరిగే అవకాశమున్న ప్రదేశాలలో మఫ్టి పోలీసులను పెట్టి, నిఘావేసి, ఆడపిల్లలను వేధించేవారిని అక్కడికక్కడే పట్టిదండించే ఏర్పాటుచేస్తే - కాలేజి అమ్మాయిలు ఆయనకు తమ జేజేలు చెప్తారు. స్వేచ్ఛగా,హాయిగా వీధుల్లో తిరగ గల్గుతారు.

---

పరివిత్తనం

నరి IET 14-44 (రాశి) విత్తనములు మా వద్ద వున్నవి. కావలసినవారు

**మందిపాటి గోపాలరెడ్డి**

కాకుపల్లి-ముత్తుకూరురోడ్డు

---

**E.P.No.21 of 1988**

**O.S.No.178 of 1980**

ఇండియన్ బ్యాంకి నెల్లూరు - పిటిషనరు/డిక్రీదారు

ఎదిరి

1)షాపూల్‌హమీద్ - 1వ రెస్పాండెంటు/జడ్జిమెంటు డెట్టరు హైకోర్టులో పిటిషనరు పొందిన డిక్రీబాకీ వసూలుకుగాను 1వ ప్రతివాదికి నోటీసు 29-1-1991 తేదికి వాయిదా కావున 1వ ప్రతివాది - రెస్పాండెంటు పగలు 10-30 గంటలకు హాజరయి ఆక్షేపణలను తెలుపుకొనవలసినదిగా నున్నాలేని యెడల సదరు విషయము 1వ రెస్పాండెంటు పరోక్షములో తీర్మానించబడునని తెలియ జేయడమైనది.

-ఎస్.వెంకట సుబ్బారెడ్డి

పిటిషనరు వకీలు

---



# శుభాకాంక్షలు



దీక్షా, దక్షతలతో ముఖ్యమంత్రిత్వాన్ని సాధించిన

గౌ॥ శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారికి

కాంగ్రెస్‌పార్టీ అభివృద్ధి, పటిష్టతలకు పాటుబడి రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిత్వాన్ని సాధించిన

శ్రీ చదలవాడ కృష్ణమూర్తి గారికి

మా శుభాకాంక్షలు

టి.రమణారెడ్డి

అమరావతి పిక్చర్స్ - నెల్లూరు.

# స్వాగతం! శుభాకాంక్షలు!!



స్వయం కృషితో ముఖ్యమంత్రి పదవినలంకరించి
నెల్లూరుకు వన్నె తెచ్చిన ప్రజానాయకుడు

## శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి గారు

మొదటిసారిగా నెల్లూరు వచ్చు సందర్భంలో స్వాగతం పలుకుతూ

నాయుడుపేటలో కాంగ్రెసుకు మూలస్తంభం
నాయుడుపేట మండలాధ్యక్షుడు

## శ్రీ చదలవాడ కృష్ణమూర్తిగారు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా నియమితులైన
సందర్భంలో వారికి మా శుభాకాంక్షలు తెలుపుతున్నాము



పి. మనోజ్ కుమార్ రెడ్డి
కళ్యాణి ఫిలిమ్స్
—నెల్లూరు.

# ముఖ్యమంత్రి పదవి ఒక మజిలీ మాత్రమే!

"కొందరు జన్మతః గొప్పవారు. కొందరు గొప్పతనం సాధిస్తారు. మరి కొందరికి గొప్పతనం ఆపాదించబడుతుంది". ఇవి సుప్రసిద్ధ ఆంగ్లనాటక కర్త షేక్స్‌పియర్ అన్నమాటలు మొదటివారిలో తమ సామర్థ్యంకన్నా పుట్టిన పరిస్థితుల ప్రభావమే ఎక్కువగా వుంటుంది. రెండవతరగతికి చెందినవారు తమ వ్యక్తిత్వ ధ్యేయాన్ని సాధిస్తారు. మూడవ రకంవారికి లభించేది అర్హతలేని ఆపాదన. మన రాష్ట్రముఖ్యమంత్రి శ్రీనేదురుమల్లి జనార్దనరెడ్డిగారిలో రెండవకోవకు చెందినవారు.

ఆయన జన్మించింది ఏమాత్రం రాజకీయ ప్రాబల్యం లేని సామాన్యమైన రైతుకుటుంబం. ఉపాధ్యాయవృత్తిలో జీవితాన్ని ప్రారంభించారు. ప్రారంభ దశలో పినతండ్రి స్వర్గీయ బాలకృష్ణారెడ్డి చేయూతనిచ్చారు. వాకాడులో తాను స్థాపించిన విద్యాసంస్థల నేతృత్వాన్ని అప్పగించారు. కాని అనహాయం అంతవరకు మాత్రమే. తరువాత జీవితంలో సాధించినదంతా వ్యక్తిశక్తితోనే. విద్యార్థిదశనుండి జనార్దనరెడ్డిగారిలో నాయకత్వ లక్షణాలుద్యోతకమవుతూవుండినాయి. క్రియాశీలక రాజకీయాలు ఓటమితో ప్రారంభించాడు. శాసనమండలికి పట్టభద్రుల నియోజకవర్గం నుండి పోటీచేసి చాలకొద్ది తేడాతో ఓడిపోయారు. ఓటమితో ఆయన నిరుత్సాహపడలేదు. ద్విగుణీకృత ఉత్సాహంతో రాజకీయరంగంలో పనిచేయసాగినారు. "దీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థములుజ్ఝగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్‌గావున్నన్"-భర్తృహరి చెప్పిన ఈవిషయం జనార్దనరెడ్డిగారికి అన్ని విధాలా అన్వయిస్తుంది. కొంతకాలంతర్వాత శాసనసభానియోజక వర్గంనుండి రాజ్యసభకు పోటీచేసి విజయంసాధించాడు. అప్పటినుండి తన రాజకీయప్రాబల్యం అనేకరెట్లుపెరిగింది. పార్లమెంటు సభ్యత్వాన్ని సార్థకం చేసుకున్నారు. కేంద్రనాయకులతో సన్నిహితత్వాన్ని పెంచుకొన్నారు. దేశనేత్రి ఇందిరా గాంధి ఆదరాభిమానాలు చూరగొన్నారు. 1978లో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ విజయానికి కారకులయ్యారు. చెన్నారెడ్డిగారి ప్రథమ ప్రభుత్వంలో రెవిన్యూశాఖామాత్యులుగా నియమింపబడి ఆశాఖకే మెరుగులు దిద్దారు. దాని స్థాయిని, ప్రతిష్ఠను పెంచారు. తనపరిపాలనాదక్షతను ప్రదర్శించారు. విద్యారంగంలో తాను చేసినసేవ ఎప్పటికీమరువరానిది. ఎడారిగా ఉన్న ప్రదేశాన్ని విద్యాకేంద్రంగా మార్చినారు. అనేక కళాశాలలను పినతండ్రి బాలకృష్ణారెడ్డిగారి పేరిట స్థాపించి విద్యాభివృద్ధికి దోహదకారి అయ్యారు. ఆప్రదేశానికి వారు చేసిన 'విద్యానగర్' అనునామకరణం సార్థకమైనది. అది త్వరలో విశ్వవిద్యాలయంగా రూపొందే అవకాశాలు మెండుగా ఉన్నాయి. అక్కడి ఇంజనీరింగు కళాశాల దేశంలో ఆరంగంలోని ప్రముఖ సంస్థల స్థాయినందుకొన్నది. వీటివల్ల జనార్దనరెడ్డిగారు విద్యావిషయిక విజ్ఞానంలో పరిణతిచెందినారు.

శ్రీ పి.వి.రమణారెడ్డి

విద్యావర్ధకులుగా పేరెన్నికగాంచారు. జనార్దనరెడ్డి గారిలోని ప్రత్యేక లక్షణం ఆయనకు కాంగ్రెసు పార్టీపట్లగల భక్తి విశ్వాసాలు. ఈవిషయంలో ఆయనకు ఆయనేసాటి. విద్యార్థి దశలోనే కాంగ్రెస్‌పార్టీలోచేరినారు. నాటినుండి నేటివరకు పార్టీని అకుంఠిత భక్తితో సేవిస్తూ ఉన్నారు! ఎట్టిపరిస్థితులలోను తన పట్టుదల వీడలేదు. ప్రయత్నం విరమించలేదు.

ప్రజలహృదయాలలో జనార్దన రెడ్డికి శాశ్వతమైన స్థానాన్ని కలిగించిన కార్యక్రమం ఇందిరాభవన నిర్మాణం. కాంగ్రెస్ పార్టీ ఓడిపోయి ఆపార్టీకింక భవిష్యత్తు లేదేమో అనిపించే సమయంలో తననకం పదవీలేనితరుణంలో నగరపు నడిబొడ్డున సుందరము, సువిశాలము అయిన భవనాన్ని అహర్నిశలు శ్రమించి నిర్మింపజేశారు. దేశంలో ఏజిల్లా కేంద్రంలోనూ కాంగ్రెస్‌కు సంబంధించి ఇటువంటి భవనం లేదంటే అది సత్యదూరం కాదు. ఇది కాంగ్రెస్ పార్టీ ఎప్పటికీ మరువరాని విషయం, పార్టీని యమట్లుంచి, ఈభవనం నగరానికి ఒక ప్రత్యేక శోభను కలిగిస్తున్నది. నగరదేవత కంఠమాలలో ఆణిముత్యం అంటే అతిశయోక్తికాదు.

జనార్దనరెడ్డిగారికి ప్రభుత్వయంత్రాంగం పనిచేసే తీరుకరతలామలకం. ఆయన పరిపాలనాదక్షత లోకవిదితమే. ఉన్నతాధికారులలో ఎక్కువమందికి ఆయనపట్ల గౌరవాభిమానాలు. వారిసహకారం ఆయనకు సులభంగాలభిస్తుంది. సామాన్యప్రజల సమస్యల పట్ల ఆయనకు మంచి అవగాహన వుంది. సమస్యలను పరిష్కరించేందుకు కావలసిన శక్తి సామర్థ్యాలకు కొరతలేదు. ఆయన ఆర్థికరాజకీయ విషయంలో అభివృద్ధికరభావాలు కలవారు.

జనార్దన రెడ్డిగారు ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసిన నాటినుండి ప్రభుత్వం పనిచేసేతీరులో



ప్రముఖమైన మార్పుకనిపిస్తున్నది. ఏముఖ్యమంత్రీ అన్ని సమస్యలనూ వెంటనే పరిష్కరించలేడు. కాని, ఏదిముందు, ఏది వెనుక, ఏవిషయంలో సత్వరచర్యలవసరము అన్న విషయాలను వితరణలో నిర్ణయిస్తున్నారు. అత్యవసర విషయాలలో త్వరితగతిన నిర్ణయాలు తీసుకొంటున్నారు. సామాన్య ప్రజలకు వీలైనంత అందుబాటులో వుండడానికి ప్రయత్నిస్తున్నారు. పార్టీలోని అన్నివర్గాల సహకారాన్ని పొందడానికి శక్తి వంచన లేకుండా కృషి సల్పుతున్నారు. ఆయనపాలనలో రాష్ట్రం అన్నిరంగాలలో ప్రగతి పథంలో త్వరితంగా పురోగమిస్తుందని ఆశించవచ్చు. ముఖ్యమంత్రిపదవి ఆయనరాజకీయపు పయనంలో ఒకమజిలీ మాత్రమేకాని గమ్యంకాదని, భవిష్యత్తులో ఆయన తన గమ్యాన్ని తప్పక చేరగలరని ఆకాంక్షిస్తున్నాను.

# అభినందనలు



రాష్ట్రాధినేతగా అనతికాలంలోనే సమర్థుడుగా పేరొంది
సింహపురి పట్టణానికి గౌరవప్రతిష్టలు చేకూర్చి
తొలిసారిగా నెల్లూరుకు విచ్చేస్తున్న

## శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డిగారు

ఇంకామరెన్నో పెద్దపదవులు పొందాలని ఆకాంక్షిస్తూ
హృదయ పూర్వక అభినందనలు తెలియ చేస్తున్నాం.

రావుల అంకయ్య గౌడ్
మండల ప్రజాపరిషత్ అధ్యక్షుడు
పొదలకూరు.

# హృదయద్వారాలు తెరచి స్వాగతిస్తున్నాం-
# మనసునే మల్లెమాలగా చేసి అభినందిస్తున్నాం!

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిత్వపు హోదాలో
మొదటిసారిగా నెల్లూరుకు వస్తున్న శుభ
సందర్భంలో హార్దిక స్వాగతం చెప్తున్నాం.
త్యాగాలతో పునీతమైన ఆయన రాజకీయ జీవితంలో
విజయ గులాబీలు మరెన్నో వికసించాలని
మనసారా ఆకాంక్షిస్తున్నాం!





# శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి

జిల్లాలో కాంగ్రెస్‌కు నిలువనీడ కల్పించిన నేత
దేవేంద్ర హర్మ్యాన్ని తలపింపజేసే
జిల్లా కాంగ్రెస్ భవన నిర్మాత
ఇందిరాభవన్ ట్రస్ట్ శాశ్వత అధినేత

పి. వి. రమణారెడ్డి

మేనేజింగ్‌ట్రస్టీ
కాంగ్రెస్ శతజయంత్యుత్సవ ఇందిరా భవన్ కమిటి
నెల్లూరు.

# నెల్లూరు కబుర్లు

## విహార్యకుడు

### జనార్దనరెడ్డి

ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డి పర్యటన ఖరారైంది. కార్యక్రమం గతవారం ఇచ్చిందే-పెద్ద మార్పులేదు. అన్నింటిలోకి వి.ఆర్.హైస్కూలు గ్రౌండ్స్‌లో జరిగేబహిరంగ సభకు ప్రత్యేక ప్రాధాన్యత నిస్తున్నట్లున్నారుసర్వేపల్లి ఎం.ఎల్.ఏ శ్రీ వి.వి.శేషారెడ్డి ఆ బహిరంగసభను గ్రాండ్‌సక్సెస్ చేయడానికి ఊరంతా కాలికి బలపం కట్టుకొనితిరిగి,జనాన్ని సమీకరిస్తున్నారు. కాని మా ఉద్దేశ్యంలో అంత కష్టపడాల్సిన అవసరమేమి కన్పించడంలేదు- జనంలో ఉన్న ఉత్సాహం చూస్తే ఆవరణం పట్టి పోయే జన ప్రవాహం దానంతటదే వస్తుందా అన్పిస్తున్నది.అయినా, శేషారెడ్డి గారికి మననునిండదుకదా?

ఎట్టి పరిస్థితిలోనూ సన్మానాల ప్రసక్తి రాకూడదని జనార్దనరెడ్డి స్పష్టంగా చెప్పేశాడు .'గురుభక్తి'చాటు కోవడానికి రమేష్ రెడ్డి తలపెట్టిన పౌరసన్మానం నీరుగారిపోయింది. పాపం.పూలమాలలు తేవద్దని సూచించాడట- ఈమాట ఎవరూ విన్పించు కోరనుకుంటాము.

టౌన్‌లో స్వాగత ద్వారాల నిర్మాణం జోరుగా జరుగుతూంది.పోటా పోటీలు పడి. ఒకరిని మించి ఒకరు కడ్తున్నారు.బ్యానర్ల సంఖ్య చెప్పనలవయ్యేట్లు లేదు.స్వాగత తోరణాలతో ఏసీస్టేడియం నుంచి ఇందిరాభవన్ వరకు రోడ్లపై కాగితాల పందిరి ఏర్పాటౌతున్నది.

ఆనం సంజీవరెడ్డిగారు సర్వం తానై తిరిగి, ఈ ఏర్పాట్లన్నీ పర్యవేక్షిస్తున్నారు.

వెంకటగిరి సమావేశాన్ని అత్యంత ఆర్భాటంగా జరపబోతున్నాడు శ్రీ డేగానారసింహారెడ్డి. ఆయన స్వంత కార్యక్రమానికి మాత్రం బ్రేక్ పడినట్లుంది. జె.కె.రెడ్డి తన 'స్వతంత్ర'పంథావీడకుండా స్వాగత సన్మానాలు చేస్తున్నాడు.

### దయానందసరస్వతి

భారత వేద,వేదాంత సారాన్ని ప్రపంచ దేశాలలో ప్రచారం చేస్తున్న యోగీశ్వరుడు,పలు ఆర్ష విద్యాపీఠాలు స్థాపించిన తపస్విస్వామి దయానంద సరస్వతి 18 తేదీ రాత్రి నెల్లూరువస్తున్నారు.19 తేది రోటరీ సమావేశంలో పాల్గొంటారు.

అప్పుడప్పుడూ ఇటువంటి మహాత్ములను సందర్శిస్తే మనసుకు శాంతి దొరుకుతుంది.

### మంత్రులు

ముఖ్యమంత్రి తోటి చాలామంది మంత్రులే నెల్లూరు వచ్చేట్లుంది. ఇప్పటికి చక్కెర మంత్రి మహమ్మద్‌జాని కార్యక్రమం మాత్రం అధికారికంగా వచ్చింది.

### రోటరీ సమావేశం

రోటరీ జిల్లా సమావేశం చాలా ఆర్భాటంగా జరుగుబోతుంది - 19, 20 తేదిలలో. ముఖ్యమంత్రితో సహా పలువురు పెద్దలను పిల్చి హంగామా చేస్తున్నాడు గవర్నర్ శ్రీజె.వి.రెడ్డి

### చెరకురైతులకు సుబ్బారెడ్డిహామీ

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ పరిధిలోని రైతాంగం శ్రేయస్సుకు తన శక్తిమేర కృషిచేస్తానని ఫ్యాక్టరీ చైర్మన్ శ్రీసామంతు. సుబ్బారెడ్డి హామీనిస్తున్నాడు.చెరకు రికవరీ శాతం తగ్గిపోవడంపై రైతులలో భయాందోళనలు పెరగడం వల్ల

వివరణనిస్తూ,వర్షాలకు పొలాలలో నీళ్ళు నిలవడంతో రికవరీ తక్కువగా వస్తున్నది తప్ప,ఫ్యాక్టరీలో ఏ లోపం లేదని చెప్పారు.రైతులు తమ చెరకు నాణ్యత కాపాడుకుంటే, ఫ్యాక్టరీలో రైతులకు అధికలాభం వచ్చేటట్లు చూస్తానంటున్నాడాయన.

ఈమధ్య ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దనరెడ్డి చెరకు రైతుల సమస్యలపై హైదరాబాదులో సమావేశం ఏర్పాటు చేసి,సుబ్బారెడ్డిగారిని కూడా పిలుప నంపారు. చెరకు రేటు విషయమై చర్చ జరిగిందా సమావేశంలో!సుబ్బారెడ్డిగారు టన్నుకు రూ300లు ఇవ్వాలనివాదించారట.కాని అధికారులు ఒప్పుకోలేదు.చివరకు రూ285లు నిర్ణయించారు. అప్పటికి సుబ్బారెడ్డిగారు చెరకు పంటద్వారా ప్రభుత్వం పెన్నులు, ఆల్కహాలు, మొలాసిస్‌ల ద్వారా టన్నుకు రూ880లు ఆదాయం అనుభవిస్తున్నప్పుడు ఇంత తక్కువ ధర నిర్ణయించడం అన్యాయమని వాదించారట.

ప్రభుత్వం రేటు ఇవ్వకపోయినా,ఫ్యాక్టరీద్వారా రైతులు సహకరిస్తే అంతకు మించిన లాభం ఏం చే వ చ్చు న ని

ఆయనంటున్నాడు.కోడలు కొడుకుని కంటానంటే వద్దనే అత్త ఉంటుందా?

### లయన్స్ పోటీలు

నెల్లూరు లయన్స్ క్లబ్,హైస్కూలు విద్యార్థినీ విద్యార్థులకు 20 తేది టౌన్‌హాల్‌లో చిత్ర లేఖనపోటీలు నిర్వహించనున్నది.ఆసక్తి కలిగిన పిల్లలు పాల్గొనవచ్చు.

### కనుపర్తి పాడు హత్య

కనుపర్తిపాడులో సి.పి.యం సానుభూతి పరుడైన ఒక లాకాలేజి విద్యార్థిని 16 తేది ఉదయం కొందరు గ్రామనస్థులే హత్యచేశారు. బస్ లో వస్తున్న ఆయువకుడ్ని బస్ లోనే పొడవడంతోపాటు,అతడు భయపడి దిగి పారిపోబోతే తరిమి తరిమి పొడిచారట. మనుషులలో ఇంతటి దానవత్వం ఎందుకు చోటుచేసుకుంటున్నదో!

(2 వపేజీ కారవ)

ఏర్పాటు చేయబడిందట. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయిన తొలి నెల్లూరీయుని రాక సందర్భంలో అటువంటి ఏర్పాట్లు, వేడుకలు అవసరమే. కాని అది ప్రత్యేకంగా అవసరమా అన్పిస్తున్నది. ఏమంటే వివాహితులైన తన కుమారులు రామ్‌కుమార్, భరత్ కుమార్ వివాహాల సందర్భంగా జనార్దన రెడ్డి ఎ.సి. స్టేడియంలో రిసెప్షన్ ఏర్పాటు చేస్తున్నారు. హైదరాబాదు పెండ్లికి కాని నెల్లూరు రిసెప్షన్‌కు కాని ఆహ్వానం అందని వారు జిల్లాలో లేరేమోనన్పి స్తున్నది. మరీమరీ పిల్చినట్లు ఎందరో మళ్లీ మళ్లీ ఆహ్వాన పత్రికలు అందుకున్నారు. ఆ రిసెప్షన్‌కు జిల్లా జిల్లా కదలి రాబోతుంది. ఏ.సి. స్టేడియం ఇసుక వేస్తే రాలనంతగా తొక్కిడి కాబోతుంది. బహిరంగ సభ అప్పుడే అక్కడే ఏర్పాటైతే బాగుండదా అని? రెంటినీ కలపడం బాగుండదను కున్నారేమో!

మొత్తానికి ముఖ్యమంత్రిగా జనార్దన రెడ్డి గారి రాక సందర్భంలో నెల్లూరు దణుతెగిరి పోతున్నది.

NDL

# రాజీవ్

(మొదటిపేజీకొనసా)

తొలిరి పదవీ ప్రమాణంచేసిన వెంటనే మిహాసటం కేవలం పార్టీ మాత్రమేనని. అందుకు శ్రీమాగంటి ప్రత్యక్షసాక్షి శ్రీమాగంటి సుభాష్ చంద్రబోస్ కారకులని శ్రీనివాసులురెడ్డి చెబుతున్నారట. ఇదే విషయాన్ని శ్రీ తొలిరి మనుమరాలుకూడా చెబుతుందని. ఆమె ప్రత్యక్షసాక్షి అని శీనయ్య అంటున్నాడట. ఎటొచ్చీ తన మంత్రివర్గ సహచరుడు పాల్గొనింపబడితే ముఖ్యమంత్రి నోరుమెదపలేదన్నది శీనయ్య ఆరోపణ. ఈ విషయాన్ని కొందరు పత్రికా విలేకరులతో చెప్పబోరుమన్నాడట. అయితే ఏవిలేకరికూడా శీనయ్య ఇలా అనుకుంటున్నారని వ్రాసిన సాహసపోలేదు. పాపం శీనయ్య జనార్దన రెడ్డి పై ద్వజానికి అవకాశం కోసం ఎదురుచూస్తున్నారట. అందుకు కావలసిన సామాగ్రిని కూడా సిద్ధం చేస్తున్నాడట.

## పాలడుగు తప్పటడుగు

పౌరసరఫరాల మంత్రి శ్రీ పాలడుగు వెంకటరావు ప్రవర్తన వల్ల మంత్రి మండలి మొత్తానికి చెడుపేరు తెచ్చేట్టుంది. అటు అధికారులతో ఇటు పత్రికా విలేకరులతో ఆయన వ్యవహరిస్తున్న తీరు తీవ్ర విమర్శలకు గురవుతోంది. కొన్ని సందర్భాల్లో పాలడుగు ప్రవర్తన ముఖ్యమంత్రి శ్రీ జనార్దన్ రెడ్డిని ఇరుకున పెడుతోంది. పౌరసరఫరాల సంస్థకి సంబంధించి వివరాలు తెలిపేందుకు శ్రీ పాలడుగు ఇటీవల విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు. ఆనవాయితీ ప్రకారంగానే విలేకరులు ప్రశ్నలు వేశారు. మంత్రి సావధానంగా సమాధానాలు చెప్పటానికి బదులు నేను చెప్పింది రాసుకోండి? నోరు మెదప వద్దు అని పరుషంగా శాసించేసరికి విలేకరులకు తల తిరిగినంతపనైంది.

ఈ విషయాన్ని ఈనెల 11న జరిగిన 'మీట్ ది ప్రెస్' కార్యక్రమంలో విలేకరులు దృష్టికి తీసుకురాగా సమాధానం చెప్పకుండా దాటవేయడానికి పాపం ముఖ్యమంత్రి ఇబ్బంది పడాల్సి వచ్చింది.

## పాతబస్తీలో రాజీవ్ పర్యటన

ఏ.ఐ.సి.సి అధ్యక్షుడు శ్రీరాజీవ్‌గాంధీ బుధవారంనాడు పాతబస్తీలో విస్తృతంగా పర్యటించి ఇటీవల అల్లర్లకు నష్టపోయిన బాధితులను పరామర్శించారు. అయితే శ్రీరాజీవ్ గాంధీ పర్యటించిన పాత్రాప్రాంతాల్లో కొంత తప్పప్పదయాం 'నిరసన' అనుభవం తప్పించుకోలేకపోయారు. ముఖ్యంగా 'మజ్లిస్' పార్టీ ఆధిక్యంగల ప్రాంతాల్లో ఏ.ఐ.సి.సి అధ్యక్షుడికి 'చేదు' అనుభవం ఎదురైంది. నగరంలో దారుణ మారణ హోమం జరిగి రెండు నెలలవుతున్నా 'తీరిగ్గా' ఇప్పుడు రాజీవ్‌గాంధీ పరామర్శించటానికి వచ్చారన్న అభిప్రాయనేపథ్యంలో శ్రీరాజీవ్‌గాంధీ విమర్శలకు గురయ్యారు. ఏదైతేనేం రాజీవ్ పర్యటన వల్ల తమకు ఎంతో కొంతమేలు జరుగుతుందన్న 'ఆశ' కూడా కొన్ని వర్గాల్లో వ్యక్తమైంది. జంట నగరాల రాచపుండుకు అసలు మందు కనుగొనేందుకు శ్రీరాజీవ్ గాంధీ మజ్లిస్ నేతలు శ్రీసుల్తాన్ సలావుద్దీన్ ఒవైసీ (ఎం.పి) శ్రీ అమానుల్లాఖాన్ (ఎమ్మెల్యే) తదితరులతో బుధవారంనాడు విమానాశ్రయం లాంజ్‌లో సమావేశమయ్యారు. ముఖ్యమంత్రి శ్రీజనార్దన్ రెడ్డి కూడా ఈ సమావేశంలో వున్నారు. మజ్లిస్ నేతలు ప్రధానంగా మాజీమంత్రి శ్రీ పి.శివశంకర్, ఆయన కుమారుడు, శాసన సభ్యుడు శ్రీ పి.సుధీర్ కుమార్ పై ఫిర్యాదు చేశారు. నగరంలో ముఖ్యంగా పాతబస్తీలో అల్లర్లకు ఆ తండ్రీ కొడుకులే ప్రధాన కారకులని మజ్లిస్ నేతలు ఆరోపించడం రాజీవ్‌కు సహజంగానే బాధకలిగించిందని అంటున్నారు. వెంటనే ఆయన శివశంకర్‌ను లాంజ్‌కు పిలిపించి మజ్లిస్ నేతల సమక్షంలో మాట్లాడారు. విభేదాలెలా వున్నా తరకమైన అపోహలు మరచిపోయి మతసామరస్య పునరుద్ధరణకు కలిసి కట్టుగా కృషిచేయాల్సిందిగా ఉభయులకు శ్రీరాజీవ్ సర్దిచెప్పారని అంటున్నారు. మతకలహాల వ్యవహారంపై ముఖ్యమంత్రి ఏలాగూ న్యాయ విచారణకు ఆదేశించినందున నివేదిక వచ్చే వరకు వేచి చూడాల్సిందిగా శ్రీరాజీవ్ మజ్లిస్ నేతలను కోరారని తెలుస్తోంది.

★

# అణగారిన ప్రజకు ఆత్మబంధువు నీవు –
# అడుగున పడిన వారికి ఆశాజ్యోతి నీ ప్రభుత!



రాజకీయ జీవితంలో అసామాన్యుడిగా ఎదిగినా
సామాన్యుల చెలికాడిగానే మెలిగే నాయకుడు
కష్టాలెన్ని దండెత్తి వచ్చినా ధైర్యం కోల్పోని ధీరోదాత్తుడు
జనం శ్రేయస్సే తన ధ్యేయంగా పరిశ్రమించే ప్రజాసేవకుడు

## శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి

గారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాధినేతగా నెల్లూరుకు విచ్చేస్తున్న సందర్భంలో మా

## స్వాగతాంజలి

– చదలవాడ కృష్ణమూర్తి

ప్రధాన కార్యదర్శి
ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ.



నమ్మిన పార్టీకి విధేయత, నిజాయితీ గల్గిన
చురుకైన రాష్ట్ర నాయకుడు, అలుపన్నది ఎరుగని
పోరాటపటిమ ఆభరణాలుగా కల్గి ముఖ్యమంత్రి పదవి
చేపట్టిన కొద్దికాలంలోనే రాష్ట్రమునకు శాంతిభద్రతలు కల్గించి
తొలిసారిగా నెల్లూరు విచ్చేస్తున్న

# శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి గార్కి

అభినందన సుమాంజలులు సమర్పిస్తున్నాము



బి. గంగాధరరెడ్డి
మున్సిపల్ కౌన్సిలర్
వెంకటరమణ బిల్డింగ్స్
పొగతోట నెల్లూరు.

# శివారెడ్డి పద్యాలు

### రాష్ట్ర ముఖ్యమంత్రి

రాష్ట్ర ముఖ్యమంత్రి రామంటే నెల్లూరు
పట్టణముకు బొమ్మపట్టదేమొ
లక్షలాది ప్రజలు,లాభం లేకోయ్యి
పడుతుచేస్తు, కలుష ప్రాప్తముంటె,

ఎంతకాలమైంటో ఏ విన్నపద్మించి,
చెల్లి రాజ్యలక్ష్మి!పీఠరవిక
పట్టుకొన్ని నీకు పారితోషికమిస్త,
పుండబట్టకన్న, పుత్తవంచి!

### జక్క

కలిసినట్టు జక్క, కాంగ్రెసు పార్టీలో
పగము ప్రాద్దుకాడ స్వప్నమొచ్చె
కవుల అల్లిబొల్లి కథలునమ్మేవారు
అట్టెలేరు, మాటకన్ననమకా!

### సంక్రాంతి

చాలకాలమైంది సంక్రాంతి పండక్కు
పేదవాడికింత పెట్టి కవిని
పాయసము,వడలు పంపోరముంమెక్కి.
ఆడివాలువేరు యూడివాలు!

అప్పచెల్లిబోయె,
అన్నదమ్ముడుబోయెు,
తల్లిబోయె, కన్నతండ్రిబోయె
చాలువాలు యింక సంక్రాంతి చేసిగ్గి?
డొలుకొరక, వేస్టు డబ్బు ఖర్చు!

### స్వప్న - రాంకుమార్

అందచందముల్లో అమ్మాయి అబ్బాయి
ఇద్దరొకటె,రంగు ఏజి తేడ
కవికి దివ్యదృష్టి కడదాకపోలల్ల,
అడదాకబోయ్యి చూడబల్ల!

శిఠింమోను చీనిచీనాంబరములిస్తె
కత్తెరోళ్ళ భయము కవకమిస్తె,
పద్దెమొకటి వ్రాసి పంపింత బుక్‌పోస్టు
పిన్నదంపతులకు పెళ్ళికాన్క!

కార్డుబెట్టిపంపు కవికి వాలోపాటు
పిల్లబల్ల యింట్లో పెళ్ళివిందు
ఆరగించుతారు,అయ్య!పీపుమిని(స్తు!
పరుంపొత్తు విషము వన్లమాకు!

### ఢిల్లీ దొరతనము

ఢిల్లీదొరతనంలో ఆల్లర్లు,గంబాలు
కుస్తీపట్లు డెయిలి కుమ్ములాట్లు
ఎక్కువైతేసంఖ్య యేదైన యింతేలె
పైన క్రింద ముష్టి హాలిటిక్సు!

చంద్రశేఖరన్న సైలెంటు,ఏవోక్క
మెత్తుకోడు, కాదు మెత్తనోరు,
పార్టీ యెట్టిదైన ప్రతివాడుకావాలి
వెక్టు ఎన్నికల్లో నీకుదెలుసు!

# సినిమా

(21 వపేజీ కొరవ)

## ఎం.ఎస్.రెడ్డికి "చలన చిత్ర బంధు" బిరుదు

వివాదరహితుడు, అందరికి కావలసిన వ్యక్తి, సేవకు వెనుకాడని వ్యక్తి అయిన సహజకవి, నిర్మాత, మల్లెమాల సుందరరామిరెడ్డి ఆంధ్రప్రదేశ్ చలన చిత్రాభివృద్ధి సంస్థ, అధ్యక్షుడుగా నియమితులైన సందర్భాన్ని పురస్కరించుకొని ఇటీవల విజయవాడలో ఆయనకు ఘనమైన సన్మానం చలన చిత్ర బంధు అనే బిరుదు ప్రదానం భారీ ఎత్తున జరిగాయి. సన్మానాలు చేయడ తప్పు. సన్మానం పొందటానికి ఇష్టపడని ఎం.ఎస్.రెడ్డి బిరుదును నేను ఉపయోగించను. బిరుదులు అభివృద్ధికి ఆటంకాలు. నిర్మాతగా ఈ సంస్థ అధ్యక్షుడిగా మాత్రమే చిత్రపరిశ్రమకు చెందినవాడ్ని. వ్యక్తిగా కవిగా నేను అందరివాడ్ని. నాకు సమాజశ్రేయస్సే ముఖ్యం నేను చిత్రరంగానికి సేవ చేయలేనని అనుకున్నప్పుడు నేనే తప్పుకుంటా నుగాని, చిత్ర పరిశ్రమకు మాత్రం ద్రోహం చేయను" అని ఉచితరీతిన సమాధాన మిచ్చి హర్షధ్వానాలు అందుకున్నారు.

## దర్శకురాలుగా జీవిత

సూర్యదేవర కథ ఆధారంగా రాజశేఖర్ హీరోగా సహారెడ్డి వెంకటేశ్వరావు, వి.ఎం.జి. కృష్ణ నిర్మించే చిత్రానికి జీవిత దర్శకత్వం వహించున్నది. రాజశేఖర్ - జీవిత జూన్‌లో వివాహం చేసుకోబోతున్నారు.

## సూర్యదేవర సారధ్యంలో మాసపత్రిక

రచయిత సూర్యదేవర సారధ్యంలో "ఇప్పుడే" అనే మాసపత్రిక బొంబాయికి చెందిన "జస్టిస్" పబ్లికేషన్స్ తరఫున వెలువడుతుంది. బాపు, ముళ్ళపూడి, వెంకటరమణ, తాళ్ళూరి రామేశ్వరి, దైవజ్ఞ శర్మ ప్రభృతు సహకరిస్తారు. కథలు, సీరియల్స్, వైద్య విజ్ఞాన వాడి జ్యోతిష్యం, సంఖ్యాశాస్త్రం, ఇంటర్వ్యూలు వగైరా ఎన్నో శీర్షికలుం టాయట. ఈ పత్రిక ఆంగ్ల, హిందీ, భాషల్లోనూ వెలువడుతుంది.

# జనవాణి

(3 వపేజీ కొరవ)

చిత్తూరు జిల్లాకుమాత్రం చిత్తూరు, తిరుపతి, మదన పల్లెంలో మూడు అడిషనల్ జిల్లాకోర్టులున్నాయి. నెల్లూరులో ఒకటే కోర్టు కావడంతో 46 మండలాల కేసులన్నీ అక్కడికే వస్తున్నాయి. కోర్టుపై దీనివల్ల పనిభారం పెరగడంతో పాటు, ప్రజలకు కూడా ఇబ్బందిగావుంది.

గూడూరు డివిజన్‌లో 16 మండలాలున్నాయి. సూళ్ళూరుపేట, కోట, వెంకటగిరి, గూడూరులలో కోర్టులున్నాయి. గూడూరులో సెషన్ కోర్టుకూడా పెడితే ఈ ప్రాంతంవారికి ఎంతో సౌకర్యం. దీని విషయమై ఇదివరకేనాయకులకు, హైకోర్టు న్యాయమూర్తులకు వినతిపత్రాలు సమర్పించారు. ఇప్పుడు శ్రీజనార్దనరెడ్డి ముఖ్యమంత్రిగా వున్నారుకాబట్టి, ఆయనే చొరవతీసుకొని తక్షణం గూడూరుకు అడిషనల్ జిల్లాకోర్టు మంజూరు చేయించాలి. ఇందుకవసరమైన భవన వసతికూడా అందుబాటులోవుంది.

కోట -పెల్లేటి గోపాల్‌రెడ్డి
అధ్యక్షుడు, బార్‌అసోసియేషన్

# పంచాంగం

తేది 22 మంగళవారము రథసప్తమి

మాఘమాస తిదులు
జనవరి నెల కా

తేది 19 శని తదియ ఉదయము గంట 8.0 వరకు
తేది 20 ఆది చతుర్థి ఉదయము గంట 8.0 వరకు
తేది 21 సోమ పంచమి ఉదయము గంట
తేది 22 మంగళ సప్తమి పూర్తిగ
తేది 23 బుధ అష్టమి రాత్రి గంట 3.40 వరకు
తేది 24 గురు నవమి రాత్రి గంట 1-40 వరకు
తేది 25 శుక్ర దశమి రాత్రి గంట 11-25 వరకు

-స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ.



# స్వాగతం! సుస్వాగతం!!

తనసుకున్నది సాధించి విజయంతో మనజిల్లాలో

మొట్టమొదట ముఖ్యమంత్రిగా పాదంమోపుతున్న

మారాజకీయగురువు



## గా॥ నేదురుమల్లి జనార్దనరెడ్డి గారికి

హృదయపూర్వక స్వాగతం పలుకుతూ

శుభాకాంక్షలు అందజేస్తున్నాము



కోడూరు శ్రీనివాసులురెడ్డి

మునిసిపల్ కౌన్సిలర్

గూడూరు



తలమంచి సిద్దారెడ్డి

గూడూరు మండలకాంగ్రెస్ ప్రెసిడెంట్

గూడూరు


ప్రియమైనవారందరికి ప్రీతిపూర్వక పిలుపు
మందాకిని
బార్ & రెస్టారెంట్
హోటల్ శివం ఇంటర్‌నేషనల్- అనిత థియేటర్‌వద్ద
నెల్లూరు.
నోరూరించే చైనీస్,
కాంటినెంటల్ వంటకాలతో
అహ్లాదకరమైన వాతావరణంలో
సాయం సమయ:ం గడపడానికి
అనువైన మధుశాల
Archana.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులు,
గౌరవనీయులు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారు
సింహపురికి విచ్చేయు శుభసందర్భంలో

# అభివందనం

ప్రజల మధ్యకు తనే నేరుగా వెళ్లి
ఆప్యాయతలు అపారంగా వెదజల్లి
అందరి అరచేతుల్లో నిలిచిన జాబిల్లి!
ప్రజా సమస్యలు తప్ప లేదు రాజకీయం
ప్రజాసంక్షేమమే ప్రవచించె జనార్దనీయం
తీసుకొంటున్న ప్రతి నిర్ణయం సమర్థనీయం
పత్రికా ప్రశంసలే ప్రబల నిదర్శనీయం!
ఒళ్లు వంచి పనిచేసే ప్రజాప్రభుత్వం
కళ్లారా చూస్తున్నాం శాన్నాళ్లకు వసంతం ప్రజాముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి
మన రాష్ట్రంలో రాజీవుడు కోరుకున్న ప్రశాంతం
తన పాలనలో జనార్దనుడు నెలకొల్పె అసాంతం!



జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి మాట
కాంగ్రెస్ పార్టీకి – ప్రజానీకానికి పటిష్టమైన రాచబాట
ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డికి కుడిభుజమై నిలచుట
కర్తవ్యంగా భావిస్తాడు ఆయన ప్రతిష్ఠ మరింత పెంచుట!
శ్రీ సంజీవి జిల్లాకు దిక్సూచి
శ్రీ జనార్దన్ రాష్ట్ర సవ్యసాచి
అశేష ప్రజానీకం పిలుస్తున్నది నేడు చేతులు చాచి
ఆహ్వానిస్తున్నాం మేమూ హృదయం తివాచీగా పరచి!



అభినందనాలతో
**తుమ్మల సుబ్బారెడ్డి**
ప్రొప్రైటర్

నర్తకి బార్&రెస్టారెంట్
ఏ.సి. సెంటర్, నెల్లూరు

నీలిమా రెస్టారెంట్ ఏ/సి,
ఏ.సి. సెంటర్, నెల్లూరు.

## సింహపురి

(5 వపేజీ కావు)
సమాజంలోని ఇరుగుపొరుగువారికి కష్టంవచ్చినా నష్టంకల్గినా మనశక్తిమేరా సహకారమందజేయాలని,ప్రతిఒక్కరూ ఆధ్యాత్మిక చింతన పెంచుకోవాలని ఉద్బోధించారాయన .స్వామివారు అట్నుంచి అటే. నెల్లూరునుండి విజయవాడకుతరలివెళ్ళారు. సింహపురి సేవాసమితి కన్వీనర్ శ్రీఆనం వివేకానందరెడ్డి ఆయనకు ఘనంగా వీడ్కోలు చెప్పారు.

### హరిజన విద్యార్థులకు ఉచిత కోచింగ్ వసతి

10వ తరగతి చదివే హరిజన,గిరిజన విద్యార్థులకు 20తేదినుండి ఉచితకోచింగ్ వసతి కల్పిస్తున్నట్లు ఆదిత్యకోచింగ్ సెంటర్ నిర్వాహకుడు శ్రీఆచార్య ఆదిత్య తెలియజేస్తున్నారు.ప్రతిఆదివారం ఉదయం 8.30 నుండి 12.30 వరకు లెక్కలు , ఫిజిక్స్,కెమిస్ట్రీ,ఇంగ్లీషులలో కోచింగ్ ఇస్తారు.ఆసక్తికల్గినవారు రామలింగాపురంలోని కోచింగ్ సెంటర్‌లో పేర్లు నమోదుచేసుకోవాలి.

### కళాసుధ వార్షికోత్సవం

'కళాసుధ' సాంస్కృతిక సంస్థ 8వ వార్షికోత్సవం 2 తేది జిల్లా గ్రంథాలయ సంస్థ ఆడిటోరియంలో జరిగింది. అల్లూరు ఎమ్మెల్యే శ్రీ కాటంరెడ్డి విష్ణువర్ధన రెడ్డి సభను ప్రారంభించి, తమతండ్రి స్వర్గీయ కాటంరెడ్డి ఆదినారాయణరెడ్డి స్మృత్యంకంగా నాటక రచయిత శ్రీ టి. కొండయ్యను సత్కరించారు. శ్రీ ఆర్. పెంచలసింగ్ నటరాజపూజ చేశారు. శ్రీసిసిరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీవాడరేవు ఆంజనేయులు భాగవత ప్రార్థన చేశారు. సభలో నాటక దర్శకుడు శ్రీ దూబగుంట నారాయణరావు,నటుడు శ్రీజిసిని రమణరావు, రూపశిల్పి శ్రీ గోవిందు, ఉత్తమ ఉపాధ్యాయ అవార్డులు పొందిన శ్రీ వై శ్రీనివాసరావు, నాదస్వర విద్వాంసుడు శ్రీ జొన్నవాడ రామమూర్తిలను సన్మానించారు. సంస్థ కార్యదర్శి శ్రీ వైద్యం శ్రీనివాసరావు స్వాగత వందనాలు చెల్లించారు.

### సింహపురి రక్తదాతలకు అమెరికా ఆంధ్రుడి విరాళం

అల్లీపురం గ్రామవాస్తవుడు, అమెరికాలోని చికాగోలో సివిల్ ఇంజనీర్‌గా స్థిరపడి ఎంతో ఉన్నతికి వచ్చిన సహృదయ మిత్రుడు శ్రీదోనిపర్తి వెంకయ్య రక్త దాతల సంస్థకు వెయ్యిరూపాల విరాళం పంపారు. ఆయనకు శ్రీ తిక్కవరపు సుకుమార రెడ్డి కృతజ్ఞతలు తెలియజేస్తున్నారు.

### విజయ ఇండస్ట్రీస్ పునఃప్రారంభం

ఆధునిక పద్ధతులతో మంచం నవారు తయారుచేసే పరిశ్రమ- విజయ ఇండస్ట్రీస్‌ను పునఃప్రారంభించారు. ఆర్థిక పరమైన ఇబ్బందులతో మూతబడిన ఈ పరిశ్రమను తిరిగి నడపడానికి ఆంధ్రాబ్యాంకు రుణసదుపాయం కల్పించింది. అందువల్ల ఆంధ్రాబ్యాంకు రీజనల్ మేనేజర్ శ్రీ ఉమాపతిరావుగారే రిబ్బను కత్తిరించి ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రాబ్యాంకు చిన్న బజారు మేనేజర్ శ్రీ ఎస్.విద్యాసాగర్ అధ్యక్షత వహించారు.

పరిశ్రమ యజమానురాలు శ్రీమతి టి. గీతాలక్ష్మి, తెరవెనుకనుండి సంస్థను నడిపించే యువకుడు, విజయస్టోర్స్ రమేష్ సభకు వచ్చిన వారందరినీ హార్దికంగా ఆహ్వానించి మర్యాదచేశారు.

### కటక్ శాంతి సభకు నెల్లూరు ప్రతినిధులు

ఫిబ్రవరి 15 నుండి 3 రోజులపాటు కటక్ నగరంలో జరుగనున్న అఖిలభారత శాంతి సంఘీభావ సంఘం జాతీయ మహాసభకు 10 మంది ప్రతినిధులను పంపాలని సంఘం నెల్లూరుశాఖ నిర్ణయించింది. వారు పేరూ -
శ్రీవి.అనంతరామయ్య, డాక్టర్ పి. మధుసూదనశాస్త్రి, శ్రీఎం.కె.షరీఫ్, శ్రీ పట్నం వేదాచలం, శ్రీటి.కోటేశ్వర రావు, శ్రీమహమ్మద్‌ఇస్మాయిల్, శ్రీ ఎం రామచంద్రయ్య, శ్రీకె.కె.భాస్కరన్, శ్రీకె.వి.కృష్ణమూర్తి, శ్రీవి.వి.రమణయ్య.

### మహతి సంగీత విద్యాలయ వార్షికోత్సవం

మూలపేట, వేద సంస్కృత కళాశాల ఆవరణంలోని శ్రీ మహతి సంగీత విద్యాలయం తృతీయ వార్షికోత్సవం సందర్భంగా త్యాగరాజ ఆరాధనోత్సవాలు జరిపారు. 5తేది సాయంత్రం శ్రీమతి జె.స్వరాజ్యలక్ష్మి గాత్రకచ్చేరి, శ్రీమతి ఆర్. పద్మావతి వీణాకచేరి,కుమారి జి .జయలక్ష్మి గాత్రకచ్చేరి శ్రీ కె.పి. నారాయణరావు వీణా కచేరి జరిగాయి. శ్రీహెచ్ ఎస్ లక్ష్మీరమణ, శ్రీ కె.ఈశ్వరరావు తదితరులు మాట్లాడారు. శ్రీ ఎస్.వి. రమణయ్య వందనాలు చెప్పారు.

### సింహపురి చిల్డ్రన్స్ సంఘం కార్యవర్గం

సింహపురి చిల్డ్రన్స్ అసోసియేషన్‌కు నూతన కార్యవర్గం ఎంపికైంది అధ్యక్షుడుగా ఎం.నాగరాజ ఉపాధ్యక్షులుగా కె.సురేష్ కె.రవికుమార్ ప్రధానకార్యదర్శిగా ఎం.మధుసూదనరెడ్డి, ఉపకార్యదర్శిగా ఎస్‌కె.చందల్‌కుమార్, టి. సుబ్రహ్మణ్యం ,కోశాధికారిగా ఎల్. శిరీష్‌కుమార్ రెడ్డి ఎన్నికైనారు.

### వెనుక బడినతరగతుల కాంగ్రెస్‌శాఖ సమావేశం

జిల్లా కాంగ్రెస్ కమిటి వెనుకబడిన తరగతుల విభాగం సమావేశం 11 తేది ఇందిరాభవన్‌లో జరిగింది .శ్రీఎం.రాజసింహ అధ్యక్షించారు. శ్రీపి.వీరయ్య, శ్రీసాధా వెంకటాచలం, శ్రీజి.పినుపాదం, శ్రీఆనందాచారి, శ్రీఅర్జునరెడ్డి,గురుమూర్తి తదితరులు మాట్లాడారు.పిసిసి,జి.కాం.కమిటీలలో బిసిలకు 25 నుండి 30 శాతం పదవులు కేటాయించాలని సమావేశం విజ్ఞప్తిచేసింది.



## ••• ఉత్తరక్రియలు



### శ్రీమతి పూండ్ల మహాలక్ష్మమ్మ గారు

8-1-91 తేదినాడు నిర్యాణం చెందినారు
వారి కర్మకతువులు

23-1-91 తేది బుధవారం నిలుపు
24-1-91 తేది గురువారం ఎత్తురేవు
మహమ్మదాపురం గ్రామంలో జరుగును

| | | |
|---|---|---|
| పూండ్ల వెంకటరమణారెడ్డి | - | కుమారుడు |
| పిస్సంరెడ్డి రమణమ్మ | - | కుమార్తె |
| పూండ్ల కనకమ్మ | - | కోడలు |
| పిస్సంరెడ్డి కృష్ణారెడ్డి | - | అల్లుడు |

# రాయితీల పుణ్యమా అని చిత్రాల రాసి పెరిగింది

రాయితీల కారణంగా మన రాష్ట్రంలో తయారయ్యే చిత్రాల సంఖ్య బాగా పెరిగింది. 1989లో 147 చిత్రాలు విడుదలవగా 1990లో 166 చిత్రాలు విడుదలయ్యాయి. భారీ చిత్రాలలో "జగదేకవీరుడు - అతిలోక సుందరి, బొబ్బిలి రాజా, కర్తవ్యం" సూపర్ బంపర్ హిట్స్. "మగాడు, కొకిల, కొండవీటి దొంగ, నాగాస్త్రం, ఇంద్రుడు చంద్రుడు, వారీ వారీ నడుమ మురారి, 20వ శతాబ్దం" సూపర్ హిట్స్. లోబడ్జెట్ చిత్రాలలో "పోలీసు భార్య, మౌనపోరాటం, జడ్జిమెంట్, చిన్నకోడలు, మామ-అల్లుడు, మనసు-మమత, పద్మావతీ కల్యాణం, పుట్టింటి పట్టుచీర, మామాశ్రీ, ఘటన, ఇరుగిల్లు పొరుగిల్లు, మాష్టారి కాపురం, ఇంద్రజిత్, ఉద్యమం" విజయవంతమయ్యాయి. డబ్బింగ్ చిత్రాలలో "ప్రేమ పావురాలు, నవవసంతం, సామ్రాజ్యం, సూర్యది గ్రేట్, తూర్పు సిందూరం" బాగా డబ్బు చేసుకున్నాయి.

హీరోలలో సుమన్, నరేష్ 9 చిత్రాలు, రాజేంద్రప్రసాద్8, కృష్ణ6, సురేష్5, చిరంజీవి, బాలకృష్ణ, రాజశేఖర్ 4, నాగార్జున, వెంకటేశ్, అక్కినేని నాగేశ్వరావు, కృష్ణంరాజు, భానుచందర్, కమలహాసన్, నాగేంద్రబాబు3, రమేష్, మహేష్2, శోభనబాబు 1 చిత్రాలలో నటించారు.

దర్శకులలో రేలంగి నరసింహారావు7, కోడిరామకృష్ణ5, ఎ.కోదండరామిరెడ్డి4, కృష్ణ, ముత్యాల

> * 1990 లో 166 చిత్రాలు తీసారు.
> * చిన్న బడ్జెట్‌లే ఎక్కువగా విజయవంత మైనాయి.
> * డబ్బింగ్ చిత్రాలు బాగా డబ్బు చేసుకున్నాయి.
> * ఇద్దరు తెలుగు హీరోలు హిందీ సీమకు వెళ్ళారు.

సుబ్బయ్య3, కె.రాఘవేంద్రరావు, దాసరి నారాయణరావు2, రవిరాజ పినిశెట్టి, బి.గోపాల్, కె.మురళీమోహనరావు, మోహన్‌గాంధీ, భరద్వాజ, సత్యారెడ్డి, కె.ఎస్.ఆర్.దాస్, ఎస్.ఎస్. రవిచంద్ర, వై.నాగేశ్వరరావు, కుర్రా రంగారావు2, క్రాంతికుమార్, విజయబపినీడు, గీతకృష్ణ, కె.వాసు, యండమూరి, విజయనిర్మల, మౌళి, ఎ.ఎస్. రామచంద్రరావు, ఎస్.వి.రాజేంద్ర సింగ్, ఎస్.పి. ముత్తురామన్, ఇ.వి.వి. సత్యనారాయణ, కొబ్రగడ్డ రవితేజ, గిరిబాబు, శరత్, కె.రంగారావు, నల్టిదీపక్, దినేష్‌బాబు, కె.ఆదిత్య, కొమ్మినేని, తారణి, తాతినేని ప్రసాద్, ఆర్.నారాయణమూర్తి, కె.మధు, ఎ.బి.ఎల్.వి. ప్రసాద్, బేబి1.

పోలీస్ ఆఫీసరుగా చిరంజీవి, నాగార్జున, విజయశాంతి, జయప్రద, మున్నగువారు నటించారు. "ప్రతిబంధ్"తో చిరంజీవి, శివతో నాగార్జున హిందీ ప్రేక్షకులకు పరిచయమయ్యారు. అగ్నిప్రవేశం చిత్రం ద్వారా నవలాకారుడు యండమూరి వీరేంద్రనాథ్ దర్శకుల జాబితాలో చేరాడు. వాస్తవ సంఘటనల ఆధారంగా "జడ్జిమెంట్, మౌనపోరాటం" చిత్రాలు తయారయ్యాయి.

కె.విశ్వనాథ్ సృష్టి "సిరిమువ్వల సింహనాదం" విడుదలకు నోచుకోలేదు. భారీ ఎత్తున విజయవంతమౌతాయని ఆశించిన "ఇద్దరూ ఇద్దరే, నేటి సిద్ధార్థ, ప్రేమయుద్ధం, పోరవరాజయాన్ని పొందాయి. కోస్తాలో పెనుతుఫాను మూలంగా 80 టూరింగ్ టాకీస్‌లు దెబ్బతిన్నాయి.

# ఒకే ఒక్క నెలలో పధ్నాలుగు సినిమాలు విడుదలౌతున్నాయి!

ఈ జనవరిలో దాదాపు 14 చిత్రాలు విడుదలకానున్నాయి. వీటిలో రెండో మూడో తప్ప మిగిలినవి అంత ఆశాజనకంగా లేవని పరిశ్రమలోని కొందరి అభిప్రాయం. ఇవి కాక డబ్బింగ్ చిత్రాలూ ఉన్నాయి. నిర్మాణం పూర్తయిన చిత్రాలు మరో 31 దాకా ఉన్నాయి. ఇవి ఎప్పుడు విడుదలవుతాయో; ప్రస్తుతం నిర్మాణంలో 86 చిత్రాలకు పైగా ఉన్నాయి.

> మద్రాసు సినిమా వార్తలు

## మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మాతగా

పంచాయతీరాజ్ శాఖ మాత్యుడుగా ప్రమాణ స్వీకారం చేసిన కొద్ది సేపటికే అకస్మాత్తుగా మరణించిన మాగంటి రవీంద్రనాథ్ చౌదరి శ్యాం ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్స్ పతాకంలో యవ్వనం కాటేసింది, బొమ్మరిల్లు, విజయ, బొట్టుకాటుక, డబ్బు-డబ్బు-డబ్బు, మగమహారాజు, మగధీరుడు, ఖైదీ నెంబర్ 786 " చిత్రాలు నిర్మించారు.

## కాగడా శర్మ మృతి

"కాగడా" పత్రికను తనదైన బాణీలో నిర్వహిస్తూ, చలన చిత్ర పరిశ్రమలోని అందరితో సన్నిహిత సంబంధాలు గల కొక్కిరగడ్డ కామేశ్వరశర్మ డిసెంబర్ 31 రాత్రి మద్రాసు త్యాగరాయనగర్‌లోని ఒక లాడ్జిలో హఠాత్తుగా మరణించారు. వయసు 55, భార్య ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు. ఈయన ఇటీవల కృష్ణా పత్రిక సలహా సంపాదకుడుగా హైదరాబాద్‌లో ఉంటూ వచ్చారు.

## సురేష్ లో శోభనబాబు

కొంతకాలం అజ్ఞాతవాసంలో ఉండి ఇటీవల "దోషి-నిర్దోషి" చిత్రంలో నటించిన, శోభనబాబుకి మళ్ళీ అవకాశాలు వస్తున్నాయి. డి.రామానాయుడు నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ చిత్రంలో ఆయన హీరో రచన, దర్శకత్వం: పరుచూరి సోదరులు.

కొరవ 16 పేజిలో

## స్వాగతం! సుస్వాగతం



రైతుబాంధవుడు, సహకార
శ్రేయోభిలాషి, నాటివ్యవసాయ
శాఖామాత్యుడుగా
ఎ.పి.మార్క్‌ఫెడ్‌ను
వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో
నోడల్ ఏజెన్సీగా నియమించి
మార్క్‌ఫెడ్ ఆధ్వర్యంలో సహకార
సంఘముల పురోభివృద్ధికి
తోడ్పడిన ఆదర్శవాది,
మా శ్రేయోభిలాషి, ఆప్తుడు

# శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారు

నేడు ముఖ్యమంత్రిగా నెల్లూరు జిల్లాకు ప్రప్రథమంగా
విచ్చేయు శుభసందర్భంలో మా హృదయపూర్వక స్వాగతాంజలి.

**ఎపి మార్క్‌ఫెడ్ నెల్లూరు జిల్లా కార్యాలయము మరియు సిబ్బంది.**

- నెల్లూరు జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీలిమిటెడ్, నెల్లూరు.
- పవ్వేరు సహకార రూరల్ బ్యాంక్ లిమిటెడ్. బుచ్చిరెడ్డిపాళెం.
- బుచ్చిరెడ్డి పాళెం సహకార రూరల్ బ్యాంక్ లిమిటెడ్., బుచ్చిరెడ్డిపాళెం.
- ఇందుకూరు పేట సహకార రూరల్ బ్యాంకులిమిటెడ్, ఇందుకూరుపేట.
- వాకాడు ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, వాకాడు.
- గూడూరు 24 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, గూడూరు.
- దగదర్తి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, దగదర్తి.
- రైతు సేవా సహకార సంఘం లిమిటెడ్, ఆత్మకూరు.
- రైతు సేవా సహకార సంఘం లిమిటెడ్, సూళ్ళూరుపేట
- యాతలూరు ప్రథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, యాతలూరు.
- నెలబల్లి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, నెలబల్లి.
- అక్కగారి పేట ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం, అక్కగారిపేట

పార్థసారథి కెమికల్స్, హైదరాబాద్; సాయికృష్ణ యేజన్సీస్, కావలి.
రామకృష్ణ ఫర్టిలైజర్స్, నెల్లూరు, మయూరిసేల్స్ కార్పొరేషన్, నెల్లూరు.

యడ్లపల్లి గోవిందు శెట్టి, నెల్లూరు; నరేంద్ర ఫర్టిలైజర్స్ - నెల్లూరు - శుభాకాంక్షలతో

## అభినందనలు



మన ముఖ్యమంత్రి

# శ్రీనేదురుమల్లి జనార్దనరెడ్డిగారు

మొదటిసారిగా నెల్లూరు విచ్చేయు సందర్భంలో
నాశుభాభినందనలు తెలుపుతున్నాను.

**పేర్నేటి గోపాలురెడ్డి**

ప్రెసిడెంట్ : నెల్లూరుజిల్లాకోళ్ళఫారములు అసోసియేషన్
కరెస్పాండెంట్ : ఏ.పి.ఎం. ఎడ్యుకేషనల్ కమిటీ
ప్రెసిడెంట్ : కళాసాగర్ - నెల్లూరు
ప్రెసిడెంట్ : శ్రీనాగార్జున నేచర్‌క్యూర్ సెంటర్ - నెల్లూరు
కౌన్సిల్ మెంబర్ - ఆల్ ఇండియా కర్షక్ సమాజ్.



## శుభాకాంక్షలు



నెల్లూరుకే వన్నె తెచ్చిన ప్రజానాయకుడు

# శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డిగారు

ముఖ్యమంత్రిగా మొట్టమొదటి సారి నెల్లూరు వచ్చు సందర్భంలో వారికి

మాకు అత్యంత ఆప్తుడు, నాయుడుపేట మండలాధ్యక్షుడు

# శ్రీ చదలవాడ కృష్ణమూర్తిగారు

ఆంధ్రప్రదేశ్ ఇందిరా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా నియమితులైన సందర్భంలో వారికి

## మా శుభాకాంక్షలు

డి. హరిబాబు, వెంకటరమణ పిక్చర్స్, నెల్లూరు.





ముఖ్యమంత్రి పదవి చేపట్టిన
కొద్ది కాలంలోనే సమర్థుడుగా
పేరొంది తొలిసారిగా నెల్లూరు విచ్చేస్తున్న

# శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారికి

రాష్ట్ర పి.సి.సి. కార్యదర్శిగా నియిమితులైన
నాయుడు పేట మండలాధ్యక్షుడు, ప్రముఖ సినీథియేటర్ల యజమాని

# శ్రీ చదలవాడ కృష్ణమూర్తి గారికి

హృదయ పూర్వక శుభాకాంక్షలు చెప్తున్నాము

సి. సుబ్బరాయుడు
ఆర్. ఆర్. పిక్చర్స్ – నెల్లూరు.



అభినందనలు



పట్టుదల, నిలకడ, రాజకీయకీయ ప్రాబల్యాలతో
ముఖ్యమంత్రి పదవిని పొందిన
శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిగార్కి

ప్రజాసేవ, పార్టీ ప్రతిష్టలకు పాటుపడి రాష్ట్ర కాంగ్రెస్
ప్రధాన కార్యదర్శిత్వాన్ని పొందిన
నాయుడుపేట మండల అధ్యక్షుడు
శ్రీ చదలవాడ కృష్ణమూర్తిగార్కి

S. హుస్సేన్
శ్రీ లక్ష్మీపిక్చర్ – నెల్లూరు

మా శుభాభినందనలు

సుధీర్
భాగ్య శ్రీ పిక్చర్స్ – నెల్లూరు

# ముఖ్యమంత్రి

జిల్లా ప్రజానీకం ప్రధానంగా కోరే కోర్కెలు నాలుగు - కృష్ణపట్నం ఓడరేవు, కృష్ణపట్నం థర్మల్ స్టేషన్, మెడికల్ కాలేజీ, వాయుదూత్ విమాన సౌకర్యం ఇవి నాలుగూ న్యాయమైన కోర్కెలు.

కృష్ణపట్నం ఓడ రేవు ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పటినుండి వినబడు తున్న కోరిక. వ్యక్తిగ ఏ.సి. సుబ్బారెడ్డిగారు ఎన్నోసార్లు దీనిపై కేంద్రంతో ప్రయత్నం చేశారు. ఆ తర్వాత దీన్ని పట్టించుకొన్న నాయకుడు లేడు. వ్యక్తిగత పరంగా





16 తేదీ హైదరాబాదు పాతబస్తీలో పర్యటిస్తున్న మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ, ముఖ్యమంత్రి ఎన్.జనార్దన రెడ్డి, పి.సి.సి. అధ్యక్షుడు వి. హనుమంతరావు, కాశ్మీర్ నాయకుడు ఫరూఖ్ అబ్దుల్లా

శ్రీ నాయుడు రాఘవరామి రెడ్డి గారు కొంత కాలం ప్రయత్నం చేశాడు. ఓడ రేవు స్థాపన జరిగితే నెల్లూరు జిల్లా పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి సాధిస్తుంది. మెడికల్ కాలేజి గురించి ఈ ఇరవై సంవత్సరాలలో ఎంత ఆందోళన జరిగిందో చెప్పలేము. దీని గురించి మళ్ళీ ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరం లేదు.

జనార్దనరెడ్డి గారే, రెవిన్యూమంత్రిగా వున్న సమయంలో ప్రారంభించిన ప్రయత్నం - వాయుదూత్ సౌకర్యం, అప్పుడు ఆగిపోయిన ఆ కృషిని ఇప్పుడు తిరిగి ప్రారంభించడం జనార్దనరెడ్డి బాధ్యత. కృష్ణపట్నం థర్మల్ స్టేషన్ జిల్లా ప్రతిష్ఠకు ప్రతీక వంటిది. పెన్నాడెల్టా ఆధునీకరణ వంటి చిల్లర మల్లర కోర్కెలు కూడా దండిగానే వున్నాయి.





Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Books Pvt, Ltd, Nellore.